# అనామకులు

## సా. జోగిరాజు

అస్కార్ వైల్డు వ్రాసిన "ఎఉమన్
ఆఫ్ నో ఇంపార్టెన్సు"కి
అనుసరణ.

[ 7 ]

సంపాదకుడు : దర్భా రాంషా.



కళాకేళీ ప్రచురణలు, శామల్‌కోట.

# అనామకులు

సా. జో గి రా జు

అస్కార్ వైల్డు వ్రాసిన "ఎడమన్ ఆఫ్ నో ఇంపార్టెన్సు"కి అనుసరణ.

[7]

సంపాదకుడు : ద ర్భా రాం షా.



కళాకేళీ ప్రచురణలు, శామల్‌కోట.

తొలిసారి : ఏప్రిల్ 1950



హెచ్చరిక :—







వెల : రూపాయి.

# ప్రకాశిక.

—[*]—



ఆస్కార్ వైల్డు [1856-1900] ప్రపంచ సాహిత్యంలో ఉత్తమ స్థానాన్ని అధిష్ఠించిన కళామూర్తి. గొప్పనాటక రచయిత, విమర్శకుడు, కవి.

"కళను వెలిబుచ్చటం, కళాకారుణ్ణి దాచటం కళకుముఖ్య ప్రయోజనం.

ఇది నీతివాచకం, అదిఅవినీతి వాచకం అనేదేదీ పుస్తకాల్లో లేదు; బాగారాయబడ్డవి; అసహ్యంగా రాయబడ్డవి—అంతే.

ఆత్మా, శరీరమూ వేరువేరనే వారికి ఆరెండూ ఉండవు.

ధనికులు ఇతరుల్ని అసహ్యించుకుంటారు.; బుద్ధిమంతులు తమ్ము తామే అసహ్యించుకుంటారు.

పర్తుతులానికి మనం బాగాజ్ఞాపకం ఉండాలంటే వాళ్ళఅప్పుల్ని ఎగదొబ్బటమే.

పరీక్షల్లో తెలివైనవాళ్లు జవాబియ్యలేని ప్రశ్నల్ని తెలివితక్కువ వాళ్లు వేస్తారు.

అన్ని వికృతాలకీ పరిశ్రమలే మూలం.

ముసలివాళ్లు అన్నిట్నీ నమ్ముతారు; మధ్యవయస్కులు అన్నిట్నీ అనుమానిస్తారు; యువకులు అన్నిట్నీ తెలుసుకుంటారు." అంటాడు ఆస్కార్ వైల్డు.

—ప్రకాశకులు.

# అంకం 1.

దృశ్యం:—లలితా రామారావు బంగాళాఎదుట. రాధా క్రిష్ణ, జానకి, సుషిమా పెద్ద కానుగ చెట్టు క్రింద కుర్చీల్లో.

జానకి : సుషిమా, నీ విక్కడికి రావటం యిదే మొదటిసారనుకుంటా! కదూ ?

సుషిమా: అవునండి. నేను పెద్దయ్యాక మద్రాసుకు రావటం కూడా యిదే మొదటిసారి.

జానకి : అక్కడకూడా నీవెప్పుడూ తోటల్లోగడిపి ఉండవనుకుంటాను. బొంబాయిలో మీవాళ్లకి తోటల్లో బంగాళాలు ఉండవని విన్నాను ?

సుషిమా : ఎక్కువగా లేవు.

జానకి : అసలున్నవా ఏమిటి ? తోటలంటే ఏమిటనుకుంటున్నావు ? ఇక్కడ మేము తోటలని వేటికి పేరుపెడతామో తెలుసా అసలు?

సుషిమా : (కొద్దిగా నవ్వుతూ) మద్రాసు కలకత్తాల వంటి మహా నగరాలు కూడా మాతోటలకంటే చాలాచాలా చిన్నవేనని మా తాతయ్య అప్పు డప్పుడూ అంటూండేవాడు.

జానకి : ఆఁ! అయితే వాటికంటే అడవులే నయమను కుంటాను. (రాధాక్రిష్ణతో) రాధా, నీ మఫ్లరేదీ? చలిగా లేదూ? ఎందుకు, నీవు వాటిని చుట్టుకోకపోతే నా పనులన్నీ మానుకుని ఆదేపనిగా నీకు మఫ్లరుఅల్లటం.

రాధాకృష్ణ: నిజంగా నాకు చలిగాలేదు జానీ.

జానకి : ఏమో! (సుషిమాతో) యింతఅందమైన స్థలాన్ని నీవెప్పుడూ చూసి ఉండవను కుంటాను?

సుషిమా : (చుట్టూచూస్తూ) చాలా అందం !—

జానకి : అయినా ఎంత చెమ్మగా ఉందో చూశావా! నిలవలేనంత చలిగా ఉంది....లలితకి ఎంతతోస్తే అంతే—ఇట్లాటి చోటికి అందర్నీ పిలిచి బాధపెట్టడం! (రాధాకృష్ణతో) కృష్ణప్రసాదొస్తాడు కాబోలు; చాలాపెద్ద ఆస్తి:

గొప్ప భూస్వామి; అతన్ని కలుసుకోవటం ఒక ప్రత్యేకతే; లేబరు మినిష్టరు చిన్నయ్య—

రాధాకృష్ణ : చిన్నయ్య కాదు డియర్, చెంచయ్య....చెంచయ్య.

జానకి : ఓహో, అతనుకూడా చాలా పెద్దమనిషే అయ్యుంటాడు. అతని గొప్పనిగురించి పెద్దపెద్ద పుస్తకాలు కూడా రాసేశాడట! ఏమో! యింత వరకూ నేనతని పేరుకూడా వినలేదు....ఇందిరా వెంకట్రావు కూడాచాలా తమాషా మనిషి. ఈకాలానికి తగ్గమనిషి.

సుషిమా : ఆ పేరు వింటేనే నాకామెను చూడబుద్ధవటంలేదు.

జానకి : నీ లాంటి పరరాష్ట్రీయులు వ్యక్తులమీద అంత యిష్టాయిష్టాల్ని ప్రదర్శించవలసిన పని లేదనుకుంటాను.... అందరిలాగే ఆమెనూ ఆహ్వానించాం.... అయినా ఆమె చాలా గొప్పయింటిబిడ్డ; టి. సి. జమీందారుగారి మేనకోడలు; ఆమెను గురించి ఒకటి మాత్రం అనుకుంటారు: ఆమెవివాహం కాకుండానే రెండు దఫాలు ఎవరితోనో పారిపోయిందట! రెండుసార్లన్నది మాత్రం నేను నమ్మలేను; కాని, ఒక్కసారి మాత్రం నిజమేననుకుంటాను.... ఒక్కొక్కసారి ప్రజలు ఎంత అసహ్యమైన అపవాదులు వేస్తారనుకుంటున్నావ్!

సుషిమా : మోహన్ కుమార్ ఎంతబావున్నాడు!

జానకి : ఆఁ, అవును. ఆ పిల్లవాడు తాలూకా ఆఫీసులో ఏదోచేస్తున్నాడనుకుంటాను. లలితకు ఆ పిల్లవాడంటే ఎంతో ప్రేమ. లలిత అతన్ని కూడా యిక్కడికి ఆహ్వానించటం చాలా గొప్ప సంగతి; కృష్ణప్రసాద్ కూడా ఆ పిల్లవాడంటే ఎందుకో దయగలిగిందంటాడు. ఏమైనా సరే, యిదిగో సుషిమా కుమారీ, నా చిన్నతనంలో యిట్లాంటివాళ్లను—అంటే, పొట్టకోసం పనిచేసుకొనే వాళ్లను—యిట్లాంటి ఇళ్లకు పిలవడమనేది ఎక్కడా ఉండేదికాదు. అసలు వాళ్లకి గొప్పవాళ్లని కలుసుకోటానికి ఏవిధమైన సావకాశాలూ ఉండేవికావు. మరీ లలితది ఎవరితో పడితే వాళ్లతోనే కలుసుకుపోయే స్వభావం; అంచాతే అన్నీ చిక్కులే తెచ్చిపెడుతుంది.

సుషిమా : మేము అట్లాంటివాళ్లనే ఎక్కువగా గౌరవిస్తాం.

జానకి : మేమంటే, బొంబాయి..—

సుషిమా : కాదు, మా మహిళాభ్యుదయ సంఘం.

జానకి : అందుకు నాకేమీ సందేహం లేదులే.

సుషిమా : చూడండి! మోహన్‌కుమారెంత సహజంగా, ఎంత నిరాడంబరంగా, ఎంత మర్యాదగా ఉన్నాడో! అంత అందమైన ప్రకృతిగలవాణ్ని నే నింతవరకూ చూడలేదు. అతన్ని కలుసుకోటం ఒక అదృష్టం!

జానకి : పెళ్లికాని ఆడపిల్లలు మగవాళ్లను గురించి అంత కుతూహలంతో మాట్లాడటం మాలో ఆచారం కాదమ్మాయీ ! మా పిల్లలు పెళ్లయ్యేంత వరకూ వాళ్ల ఊహల్ని పైకి రానీరు.

సుషిమా : మీ ఆంధ్రదేశంలో యువతీ యువకులు స్నేహంగా ఉండటానిక్కూడా ఒప్పుకోరటగా ?

[ప్రవేశం : లలితా, రాముడు రెండు కుర్చీలతో]

జానకి : నేనదే అంటున్నానిప్పుడు "లలిత ఏవిషయమైనా చాలా ఆలోచించే చేస్తుం"దని. నిజంగా ఎవరెవర్ని కలుసుకోవాలో వాళ్లనే ఆహ్వానించటం ఎంతో విచక్షణతో కూడుకున్న పని।

లలిత : అదే జానీ, యింకెవర్నైనా పిలవాలంటే....ఎందుకు? మనలో కలవలేరు. మనమంతా ఒకరికొకరం అంతా కలిసి పోగలం.

(రాముడు కుర్చీలను చెట్టుక్రిందవేసి వెళ్లిపోతాడు.)

[మోహనకుమార్ ప్రవేశం]

మోహన్ : లలితాదేవీ ! వో లలితాదేవీ! ఓ గొప్ప శుభవార్త !....జమీందారు కృష్ణప్రసాద్ నన్ను తన శక్రటరీగా వేసుకుంటా నన్నారు.

లలిత : ఏమిటి? అతని శక్రటరీగానా? నిజంగానే! చాలా గొప్ప సంగతే. మోహన్! నీవు చాలా అదృష్టవంతుడివోయ్! నీ భవిష్యత్తు చాలా ఉజ్జ్వలంగా ఉండబోతుంది। మీ తల్లి యీ శుభవార్తవింటే చాలా ఆనందిస్తుంది. ఉండు; ఉండుండు. నేనిప్పుడే ఆమెకు కబురు చేస్తాను. ఎట్లాగైనా యీ రాత్రి భోజనానికి యిక్కడికి రమ్మంటాను. ఆమె నిక్కడికి—యిక్కడికేమిటి ఎక్కడికైనాసరే రప్పించడం ఎంత కష్టమో నాకు తెలుసు. అయినా ప్రయత్నిస్తా. రాముడూ ! ఓ రాముడూ !

మోహన్ : ఈ వార్త తెలిస్తే మాఅమ్మ తప్పకుండావస్తుంది.

[రాముడు ప్రవేశం]

లలిత : ఆఁ, ఆఁ ! ఆసంగతి తప్పకుండా రాస్తా. (రాముడితో) ఉండుండు. కొద్దిగా నిలబడు. (ఉత్తరం వ్రాస్తుంది)

జానకి : మోహన్, నీవు చాలా అదృష్ట వంతుడివోయ్. యీ వార్త విన్నాక నాకు చాలా సంతోషంగా ఉంది. కాని, యింత చిన్నవయసులోనే అంత పెద్ద బాధ్యత ?

మోహన్ : నా బాధ్యతను గుర్తిస్తూ. ప్రసాద్ గారికి తృప్తికరంగా పనిచేయగలననే అనుకుంటున్నాను. (సుషిమాతో) ఏమండీ మీరేమీ, మాట్లాడకుండా కూర్చున్నారే? నాకు చాలా సంతోషంగా ఉందీవేళ.

సుషిమా : మీకు అంతగా యిష్టమైన ఉద్యోగమా యిది?

మోహన్ : అంటే,....అంటే మరి, నేను....నాకు—నేనుఆశించినవి కొన్నికొన్ని—ఏవైతేనేమిలెండి...నవ్వుతారేం...దూరమై పోతాయను కున్నాను. ఎంతో నిరాశ చెందాను. యిప్పుడు— — అలా నవ్వుతారేం—

సుషిమా : (నవ్వుతూ) దేన్నిగురించీ నిరాశచెందగూడదండి. అంత మాత్రంలో, నిరాశ చెందడమంటే మరణించడ మన్నమాట. జీవితాభ్యుదయానికి ఆశే ప్రధాన సూత్రం.

లలిత : జానీ! కృష్ణప్రసాద్‌ని రాయబారిగా పంపుతారని విన్నాను. నిజమేనా ?

జానకి : ఏమో, ప్రభుత్వం అవివాహితుల్ని యితర దేశాలకు రాయబారులుగా పంపుతారని నే ననుకోను. దాని వల్ల చాలా చిక్కులుండొచ్చు.

లలిత : ఆఁ అదేమిటే! అదేమంత పెద్దసంగతి! ప్రసాద్ ఏదో ఒక రోజున వివాహంకూడా చేసుకోవచ్చు; బహుశా అతను చంద్రావళినే చేసికోవచ్చు. అతనొకసారి నాతో ఆమె కుటుంబం చాలా పెద్దదని కాబోలు అన్నాడు. ఆమె కుటుంబం పెద్దదనో లేక ఆమెకు వెనకా ముందూ 'నా' అనే వాళ్లెవళ్లూ లేరనో గాని అన్నాడు; మరిచిపోయాను. రెంటిలో ఏదో అన్నాడు. అమెరికాకు యిండియా రాయబారిగా వెళ్లుతూన్న వానిని పెళ్ళాడటం గొప్ప అదృష్టం కదూ!

జానకి : ఆచంద్రావతికి, ప్రజలపేర్లు మాత్రమే జ్ఞాపక ముంటాయిట! కాని వాళ్లముఖాల్ని మరిచి పోతుందట! ఆమె తగుతుందిలే.

లలిత : అవును. అది చాలా సహజమే జానీ. (రామునితో) ఫణిని జవాబు తీసుకరమ్మను.

(కవరు వానికివ్వగా రాముడు పోతాడు)

మోహన్ : లలితాదేవీ, మీకు నేనంటే ఎంతదయ! (సుషిమాతో) కొద్దిగా అట్లా తిరిగొద్దాం వస్తారా ?

సుషిమా : ఓ........

(యిద్దరూ వెళ్లిపోతారు).

లలితాదేవి: మోహన్ నిజంగా చాలా అదృష్టవంతుడు. ఎందుకో నాకు అతన్నిచూస్తే చాలాయిష్టం. ప్రసాద్‌కి యివాళ యితన్నిగురించి చెబుదామను కున్నాను. నేను రికమెండు చేయకుండానే పనిజరిగిపోయినందుకు నాకుచాలా ఆనందంగా ఉంది. ఒకర్నిగూర్చి ఒకరు సిఫార్సుచేయడం చాలా అసహ్యంగా ఉంటుంది; కదు జానీ? పాపం రుక్మిణి అందువల్లనే అందరకీ అయిష్టమై పోయింది.

జానకి: అవునవును. చాలాసార్లు ఆమె మానాన్నగారి దగ్గరకుకూడా వచ్చింది. ఆమెకు చిన్నప్పుడు సంగీతంచెప్పిన ఒక కన్నడమనిషి కొడుక్కు ఏదైనా ఉద్యోగం యిప్పించమని—అధమం రోజుకు రెండుసార్లేనా వచ్చేది. మానాన్నగారు చాలా విసుక్కునేవారు.

లలిత: ఆఁ! చూశావామరి!

జానకి: రాధా, బయట చాలాచలిగా ఉంటుంది నీకు, లోపలికి వెళ్ల రాదూ?

రాధాకృష్ణ: చలిగాలేదు జానీ, నావంట్లో బాగానే ఉంది.

జానకి: నీబాగోగులను గురించి నీకంటే నాకేబాగా తెలుసని యిప్పటికైనా వప్పుకో. నిన్ను బతిమాలుకుంటాను; లోపలికెళ్లు, నేచెప్పినట్లుచేయి.

(రాధాకృష్ణ వెళ్లిపోతాడు).

లలిత: నువ్వాయన్ని పాడుచేస్తున్నావు జానీ, నిజంగాపాడుచేస్తున్నావు.

[ప్రవేశం. శశికళ, యిందిరా వెంకట్రావు.]

(యిందిరతో) యిందిరా, యీక్రోటన్సు నీకు బావున్నాయా, యీ సరుగుడుచెట్ల వరస, తోటచివరంటా సముద్రపొడ్డు వరకూ వుంది.

యిందిర: వో, అద్భుతంగా ఉన్నాయి. ఈచెట్లనుచూస్తూంటే బృందావనంనాటి వేణుగానం జ్ఞాపకంవచ్చి, ఏదో మధుర భావంలో మునిగిపోతాను.

శశికళ: క్రోటన్సు చాలా అందంగా వున్నాయి!

యిందిర: నేనొక్కై దారు నెల్లపాటు యీతోటలో గడిపితే యింత ప్రపంచంలోకిరాబుద్ధిపుట్టదను కుంటాను.

లలిత: ఒకసారి శోనీకూడా యీమాటే అంది. పాపం, పిచ్చిపిల్ల! యిక్కడిన్నించే రంగారాంతో పారిపోయింది. అప్పుడు వాళ్లవాళ్లంతా నామీద

పడ్డారు. వాళ్ళిద్దరూ సుఖంగా. రెణ్నెల్లైనా ఉండకుండానే అతడుచనిపోయాడట పాపం! సోనీ అప్పట్నించీ భగవాన్ దగ్గరో, రామదాసాశ్రమంలోనో ఉంటోం దట; సరిగా జ్ఞాపకంలేదు.

యిందిర: పారిపోవటం కేవలం చచ్చుతనం; పచ్చివిరికితనంకూడాను. పారిపోయి ఏదో అపాయాన్నుంచి తప్పించుకున్నామంటారు; కాని సరిగ్గా ఆ అపాయంలోకే పారిపోతారు.... యీ నవయుగంలో అపాయమనే మాట కేవలం అర్థంలేనిదే.

జానకి : ప్రస్తుతం ఆడపిల్లలంతా కత్తిపదును మీద నృత్యం చేయటమే తమ జీవితలక్ష్య మనుకుంటున్నారు.

ఇందిర : అవును, అట్లాంటి లక్ష్యంవల్ల అర్హత ఉన్నవాళ్లకు అదృష్టం కూడా కలిసొస్తే యిక ఆ జీవితం చాలా ఉజ్జ్వలంగా వెలిగిపోతుంది. కాని, ఆరెండూ లేనివాళ్లకు, ఆఖరకి, ఆరెంటిలో ఏ ఒక్కటి లోపించినా, జీవితం దుర్భరమై పోతుంది.

శశికళ : చాలా నిజం చెప్పేవ్, యిందిరా !

లలిత : యిటువంటి పద్ధతులవల్ల ప్రపంచం ఎట్లా మారుతుందో నా కర్థం కాకుండా ఉంది.

శశికళ : ఈ ప్రపంచం కేవలం మగవాళ్లకోసమే. ఆడవాళ్లకు ఎంత మాత్రం కాదు.

ఇందిర : శశీ, వాళ్లకంటే కూడా మనకు మంచిరోజులొస్తాయి. కాని పురుషునికంటే మనల్ని నిరోధించే యితర ఆటంకాలు అనేకమైనవున్నాయి.

శశికళ : అవునవును. నేను వాటిమాటే మర్చిపోయాను.

[ప్రవేశం: రాధాకృష్ణ, చెంచయ్య (లేబరుమినిష్టరు)]

లలిత: వో! చెంచయ్యగారా! ఎక్కడా ఊపిరాడటం లేనట్టుందే! ఏమండీ ?

చెంచయ్య: ఇప్పటికి తెమిలిందండీ. హరిజనాభ్యుదయం కోసం, ఒక బిల్లు రేపు శాసనసభలో ప్రవేశపెట్టాలండి. ఆ సమయంలో నేను మాట్లాడ వలసింది యిప్పటికి తయారు చేసుకోగలిగాను.

జానకి: రాధా, నువ్విలా రారాదూ ? బయట మంచుపడుతూంది.—

రాధాకృష్ణ : నాకిక్కడ బాగానే ఉంది జానీ!

జానకి : అయినాసరే. యిలావచ్చి నా పక్కన కూర్చో.

(రాధాకృష్ణ వెళ్ళి ఆమె ప్రక్కకుర్చీలో కూర్చుంటాడు)

శశికళ : ఏమిటండీ మీరింతవరకూ తయారు చేసింది? మిస్టర్ చెంచయ్యగారూ!

చెంచయ్య : మామూలువిషయమేనండీ. ప్రభుత్వ నీతివి గురించి.

శశికళ : అట్లాంటి విషయాల్ని గురించి మాట్లాడటం చాలా కుతూహలంగా ఉంటుంది.

చెంచయ్య : సత్యమూ అహింసా మన జాతీయతకు ప్రధానసూత్రాలు. వాటిని ప్రభుత్వం విస్మరించినట్లయితే దేశంలోతలెత్తుతూన్న అభివృద్ధి నిరోధక శక్తులికి దేశాన్ని. దేశంలోని అహాయిక ప్రజానీకాన్ని చేతులారా అప్పగించవలసిన రోజులొస్తాయంటే ఎంతమాత్రం ఆశ్చర్యపడవలసిన పనిలేదంటాను.... అందుచేత వెనకబడిన మన సోదర మానవులకు ప్రభుత్వం వీలైనంత సహాయంచేసేలా మనమంతా ప్రభుత్వానికి మనస్ఫూర్తిగా తోడ్పడాలి. వాళ్ళిప్పుడు నిద్రమేల్కొని నాగరిక సంఘాలతో సమానంగా గుర్తింప బడడానికి చాలా కుతూహలపడుతున్నారు. అంతేగాకుండా నేటి రాజకీయాల్లో కూడా జోక్యం కలిగించుకోడానికి చాలా శ్రద్ధ కనబరుస్తున్నారు. కాబట్టి....

శశికళ : మీవి చాలా గొప్ప ఊహలు! చాలా గొప్ప ఊహలు!!

జానకి : ఆడవాళ్ల రాజకీయాల్లో కలగజేసికోటాన్ని గురించి మీఉద్దేశ్యం ఏమిటి చిన్నయ్యగారూ?

రాధాకృష్ణ : చిన్నయ్యో కాదు, డియర్. చెంచయ్య! చెంచయ్య!

చెంచయ్య : ఓ. యిప్పటికే చాలామంది స్త్రీలు రాజకీయాల్లో చాలా బాధ్యతగల హోదాలను నిర్వహిస్తూ చాలా సమర్థులనిపించుకుంటున్నారు కదండీ. కాని స్త్రీలకు యిల్లే సరైన స్థానమనుకుంటున్నాను. సహనం, పాతివ్రత్యం భారతస్త్రీల సొత్తు. తన పాతివ్రత్య మహిమతో సాక్షాత్తూ మరణదేవతైన యముణ్ని కూడా గడగడలాడించి భర్తను పునరుజ్జీవితుణ్ని చేసిన భారతరమణి నేడురక్షక భటిగా సాక్షాత్కరించడం ఎంతవిచారకరం! వేశ్యాలోలుడైన తనరోగిష్టిభర్త భోగసంతృప్తికై సాక్షాత్తూ ప్రత్యక్షదైవమైన సూర్యభగవానుణ్ని ఒక్కఅడుగు ముందుకు కదలకుండాజేసి తన అపూర్వ పాతివ్రత్యమహాత్మ్యాన్ని ప్రకటించిన భారతనారి, నేడు శాసనసభల్లో నిలిచి గొంతెత్తి విడాకుల హక్కు

కోసం వాదించటం ఎంత హాస్యాస్పదం! కాబట్టి....

శశికళ : ఆడవాళ్ల గురించి మీ కింతటి పవిత్ర భావముండటం ఎంతో సంతోషకరమైన విషయం.

లలిత : హాఁ, అవును, కృష్ణ ప్రసాద్‌కు ఆడవాళ్ల పవిత్రతలోనూ, పాతివ్రత్యంలోనూ ఎంతమాత్రం నమ్మకంలేదు. పైగా వాటికి వీసమెత్తు విలువ కూడా యివ్వడు.

[ప్రవేశం : కృష్ణప్రసాద్]

శశికళ: అందుకే ప్రపంచమంతా ప్రసాద్ చాలా చెడ్డవాడంటుంది.

ప్రసాద్: ఏ ప్రపంచం శశీ నన్ను చెడ్డవాడంటూంట? ఈ ప్రపంచం కాదను కుంటాను. బహుశా అది మరో ప్రపంచమై ఉంటుంది. ఈ ప్రపంచానికీ నాకూ రాజీకుదిరిపోయి చాలారోజులైంది.... .... ....

(యిందిరకు పక్కగా కుర్చీలో కూర్చుంటాడు)

శశికళ: నాకు తెలిసిన ప్రతివారూ నిన్ను చాలా చెడ్డవాడంటారు.

ప్రసాద్: ఎవర్ని గురించేనా చాటుగా అనుకొంటున్న మాటల్లో నిజ మెంతుంటుందో కాని, ఈరోజుల్లో ముఖంఎదుట మాట్లాడే మాటల్లోమాత్రం నిజం ఉండదని నాకు పూర్తిగా తెలుసు.

లలిత: ప్రసాద్! నువుమరీ విపరీతంగా తయారౌతున్నావు. ఊఁ— దానికేం గాని....మర్చిపోయాను; మోహన్ని శక్రెటరీగా వేసుకొన్నావటగా; యిప్పుడే అతను చెప్పాడు; మాఅందరికీ చాలా ఆనందంగావుంది. అతనిమీద చాలాదయ చూపించావు!

ప్రసాద్ : దయా? అదేమీకాదు. దయ అనేది చాలా భయంకర మైన మాట! ఎందుకో అతనంటే నాకు ఇష్టమైంది; నాకు పనికొస్తాడని తోచింది, అంతే—బహుశా నేను పొరబడ్డానేమో!

లలిత : మోహన్ చాలా ఉత్సాహకరమైన యువకుడు. అతని తల్లికీ నాకూ చాలా స్నేహం, బొంబాయినించి వచ్చిన ఆమెతో ఇప్పుడే అలా వెళ్ళాడు.....సుషీమా చాలా అందమైన పిల్ల కదూ జానీ!

జానకి : ఆ....చాలా అందమైన పిల్లే! యీ చదువుతున్న ఆడపిల్ల లెప్పుడూ అక్కడికీ యిక్కడికీ ఎందుకల్లా తిరుగుతుంటారో! ఆమె నాతో అంటుందీ: బొంబాయి, ఆడవాళ్లకు స్వర్గంలా ఉంటుందట!

ప్రిసాద్ : అయితే యీ దేవకన్య ఆ స్వర్గాన్ని విడిచిపెట్టి ఎందుకు వచ్చినట్లు ?

జానకి : అసలీమె తలిదండ్రు లెవరు ?

శశికళ : వీళ్ళెప్పుడూ ఆ విషయాన్నే దాచేస్తారు.

లలిత : ఏమిటే శశీ, కుమారి సుషిమా అంటే ఎవరనుకుంటున్నావు? జానీ, ఆమె తలిదండ్రులు చనిపోయారు. ఆమె తండ్రి గొప్ప కోటీశ్వరుడో, గొప్ప వేదాంతో ఏదో సరిగా జ్ఞాపకంలేదు. బహుశా రెండూనో! కాని అతను ఎట్లా సంపాయించేదో మాత్రం నాకు తెలీదు.

ఇందిర : బొంబాయి సెల్యూలాయిడ్లంటే నాకు చాలా యిష్టం.

చెంచయ్య : అంటే ?

ప్రిసాద్ : ఫిల్ములనుకుంటాను. బొంబేఫిల్ములు.

లలిత : హుఁ! బావుంది ...డుఃఁ—ఆమె ఆస్తంతా ఏవిధమైన సంపాదనో నాకు తెలీదు గాని, కుమారిసుషిమా మాత్రం, నాకు చాలా నచ్చింది. ఆమెకాకాలరుకమీజు ఎంత అందంగా ఉంటుందో చూడు జానీ! శశి ఆమె చీరకట్టటం ఎంత జాగ్రత్తగా, ఎంత అందంగా ఉంటుంది ?

శశికళ : అక్కడ పెద్దపెద్ద యిళ్లలోని ఆడపిల్లలు ఫిల్ముల్లో నటించడమంటే పడిచస్తారట!

ప్రిసాద్ : మరీ చిన్నచిన్న యిళ్లల్లో వాళ్లెందుకు పడిచస్తారో ? అది తెలియదేమిటి శశీ ?

ఇందిర : చిన్నచిన్న యిళ్లల్లోనివాళ్లు రోజూ ఊరికేనే ఛస్తూంటారు.

ప్రిసాద్ : కాదు, వాళ్లు మహిళాకాంగ్రెసు వాలంటీర్లుగా జేరిపోతారు.

చెంచయ్య : మహిళాకాంగ్రెసు చాలా ఆదర్శమైన సంస్థని మీరు వప్పుకోరా ? యింకా అదిప్పుడు బాల్యావస్థలోనే ఉందని మనం గమనించాలి. కాబట్టి....

ప్రిసాద్ : అది యవ్వన దశలోకి రావటమంటే మళ్ళీ అది అంధయుగంలోకి పోవటమన్నమాట! యిప్పుడు వాళ్లమాటలు వింటూంటే, సీతా అరుంధతుల్లా ఐపోవాలనుంది కాబోలనిపిస్తుంది. అట్లా అయిపోవటం ఎంత తేలికో వాళ్ల కింకా తెలియదనుకుంటాను....ప్రిసీదల్లో ఉన్నవాళ్లు కాంతిలోకి రావడానికి బదులు గాఢాంధకారంలోకి పోతున్నారు.

చెంచయ్య : ప్రస్తుతం వాళ్లల్లో కొద్ది లోపాలున్నమాట నిజమే, కాని వాటిని సరిచేసే మార్గాలు ఉన్నాయి ? కాబట్టి ...

ప్రసాద్ : మహాశ్చర్యం !

లలిత : ఎక్కడైనా—ఏ సంఘాలు గాని, ఏ సంస్థలు గాని. ప్రస్తుతం చాలా విచారకరమైన పరిస్థితిలో ఉన్నాయి. యిక రేపట్నుంచి ప్రతివాళ్ళకీ వోటు హక్కు ఉంటుందట. నీవు ఒప్పుకుంటావా ప్రసాద్. చదువురానివాళ్ళ క్కూడా వోటు హక్కుండటానికి ?

ప్రసాద్: అసలు, హక్కు ఉండవలసిందే వాళ్లకి.

చెంచయ్య: మీరు ఏపక్షాన మాట్లాడుతున్నారండీ నాకర్థమవటంలేదు?

ప్రసాద్: నేనెప్పుడూ పక్షాలనుబట్టి మాట్లాడనండీ. పక్షాల్ననుసరించి మాట్లాడటం వినయవిధేయతలకు మొదటి మెట్టన్నమాట! ఆతరవాత కీర్తికోసం పాకులాట....ఏమైనా మనకాంగ్రెసువాళ్లు ఎవరకీ అంత అపకార్లుకారనుకుంటా. మీ రెప్పటికి సభలద్వారాను, శాసనాలద్వారాను శాంతి స్థాపించ చూస్తారుకాని.... అయినా అదంతా వోతంతు....

చెంచయ్య: కాంగ్రెసుయొక్క శాంతిప్రియత్వాన్ని మీరుఏవిధంగానూ శంకించలేరు. చూడండి. అనేకసార్లు ముస్లింలంటే గొప్పసానుభూతి చూపించింది. కాబట్టి....

ప్రసాద్: అదే మీకాంగ్రెసుయొక్క ప్రత్యేక దుర్గుణం. గాంధీగారి సూత్రాల్ని పూర్తిగా తలదాల్చినట్టు నటించడంవల్ల అనేకసార్లు ప్రజల్ని యాతన పెట్టారు. యింకాఅదే పంథాలోనే నడుస్తున్నారు. నటన పరనాశనానికేకాకుండా ఆత్మనాశనానిక్కూడా హేతువౌతుంది.

చెంచయ్య : దేశంలో ఇంకా కమ్యూనిజం ఒక పెద్ద సమస్యయిపోతూంది. దాన్ని గురించి ప్రభుత్వం ముందే తగు చర్యల్ని తీసుకోవటం తప్పనిసరౌతోంది. కూలిజనమంతా పిచ్చిగా వాళ్ళ మాటల్ని నమ్ముతున్నాడు. కాబట్టి....

ప్రసాద్: ఆఁ, అదేమంత పెద్దసమస్య! తిండీబట్టా పుష్కలంగా వాళ్లకందే యేర్పాట్లుచేస్తే చాలాతేలిగ్గా పరిష్కారమైపోతుంది. యికమధ్యమ తరగతి ప్రజలకి, గాంధీగారి జననోత్సవాలూ, మరణోత్సవాలూ యింకా యింకా వీలైనన్ని ఉత్సవాలు ఆయనపేరుగా ఆరనివ్వకుండా చేస్తూంటే, నూలు వడుక్కుంటూ ఇతర గోలలేవీ పట్టించుకోరు!

శశికళ: నిజం. నిజం. మీరు చెప్పిందంతా నిజం.

చెంచయ్య: మీరు నిజంగా మనస్ఫూర్తిగా మాట్లాడారా ? కాబట్టి....

ప్రసాద్: ఓ. మనస్ఫూర్తిగానే చెంచయ్యగారూ ! (యిందిరతో) యిది చాలా దురలవాటైపోయింది ప్రజలకి. ఏదైనా మాట్లాడుతూంటే "మీరు మనస్ఫూర్తిగా మాట్లాడుతున్నారా" అని అడగటం. దానిసత్వం అలవాటైన ప్రజలకి అవగాహన శక్తిలోపించి పోయిందనుకుంటాను.

లలిత: ఏవిషయాన్నిగురించి నువు మాట్లాడేది, ప్రసాద్ ?

ప్రసాద్: అ, ఏమీలేదు. నేటిపత్రికల్ని గురించి.

లలిత: పత్రికల్లో రాతలన్నీ నువునమ్ముతావా?

ప్రసాద్: నమ్మరానివి పత్రికలొక్కటేనేమిటి నీకు కనబడుతుంట ?

లలిత: అయితే పత్రికల్ని నీవు చదువుతావన్నమాట !

ప్రసాద్: యీరోజుల్లో యిన్ష్యూరెన్సు ఏజంట్లనుంచైనా తప్పించుకోగలిగాను కాని, యీవార్తా పత్రికల్ని తప్పించుకోటం నాతరంకాలేదు.

(యిందిరతో లేస్తూ, టేబిలుమీద పత్రిక తీస్తాడు.)

లలిత: ఎక్కడికేమిటి లేస్తున్నాడు ?

యిందిర: మీతోటచివరి సముద్రతీరం పంచమహాపాతకాలంత ఆకర్షణతో ఉంటుందని చెప్తున్నారు ప్రసాద్‌గారు.

లలిత: చూడవలసినంత అందమేమీ లేదనుకుంటాను.

(కృష్ణప్రసాద్, ఇందిర వెళ్ళిపోతారు)

జానకి: మరువుకురాని రకం యిందిర!

లలిత: యిందిరకు చాలాచమత్కారమైన నాలికుంది.

జానకి: అదితప్ప ఆమెకింకేమీ లేదనుకుంటాను.

లలిత: అంతేననుకుంటాను. [గిరిజాశంకర్ ప్రవేశం] గిరిజా, రా. యిలా కూర్చో. (గిరిజాశంకర్ శశికళప్రక్క కుర్చీలో కూర్చుంటాడు)

జానకి: లలితా, ఎవర్నిబడితే వాళ్లని వట్టినే నమ్మేస్తావు. అదేవీలో పెద్ద పొరబాటు.

శశికళ: ప్రతివారినీ అనుమానంతో చూడటమే మంచిపద్ధతంటారా?

జానకి: అవును వాళ్లమంచితనాన్ని మనంగుర్తించేవరకూ. బహుకాలం దుకు చాలారోజులు పట్టవచ్చు. అంతవరకూ అనుమానంతో చూడటమే మంచిది.

శశికళ, మానవజీవితంలో చాలాభయంకరమైన అపవాదులు పుటతాయి.

లలిత: అవిపుట్టిన ఆరు ఘడియలు దాటకుండానే మరణిస్తాయంటాడు ప్రసాద్.

చెంచయ్య: ప్రసాద్, మనిషి చాలాతెలివైన వాడేగాని ప్రస్తుతయుగంలో పవిత్రత ఎంతముఖ్యమైనదో గ్రహించినట్టు కనబడడంలేదు. కాబట్టి ...

శశికళ: యీశతాబ్దంలో పవిత్రత చాలాముఖ్యం.

చెంచయ్య: ఆయనతో మాట్లాడుతూంటే గృహస్థ జీవితాన్ని కూడా ఆయన వప్పుకోడనిపించింది. అందులోని శాంతి సౌఖ్యాలాయన కేమాత్రం తెలియవనుకుంటాను. యిదంతా కేవలం విదేశభావాల మహాత్యం. కాబట్టి....

శశికళ: మనగృహస్థ జీవితమంత అందమైనదీ సుఖమైనదీ మరోటి లేదు.

చెంచయ్య: సమస్త ధర్మసూత్రాలికీ ప్రధానమైన యీగృహస్థజీవితాన్ని మనపూర్వులేగనుక మనకు ప్రసాదించి ఉండక పోయినట్టయితే యీపాటికి మనంకూడా మన యిరుగు పొరుగు వాళ్ళలాగే తయారౌదాం. కాబట్టి....

శశికళ, అదిచాలా విచారకరం.

చెంచయ్య: ప్రసాద్‌గారి భావాలను వింటూంటే నాకు నిజంగా భయం వేసింది కూడాను. ఆయనకు స్త్రీఅంటే పుత్తడిబొమ్మ. నేను మాత్రం స్త్రీని ఆటబొమ్మగా చూడలేను సుమా. ఆమెఅర్ధాంగి, సహధర్మచారిణి. ఆమెలేక పోయినట్లయితే పురుషుడు తనకర్తవ్యాన్ని ఆదర్శాన్ని చాలాతేలిగ్గా మర్చిపోతాడు. కాబట్టి....

శశికళ: స్త్రీని మీరావిధంగా గౌరవించడం చాలా గొప్పసంగతి.

జానకి: మీకు పెళ్ళైందా చిన్నయ్యగారూ?

రాధాకృష్ణ: చెంచయ్యా, డియర్, చెంచయ్యా.

చెంచయ్య: నాకు పెళ్ళైంది.

జానకి: కుటుంబం?

చెంచయ్య: ఉంది.

జానకి: ఎంత మందో?

చెంచయ్య: ఎనమండుగురు. తల్లినీ వాళ్లనీ అందర్నీమావూళ్లోనే విడిచి వచ్చాను. యిక్కడపనులు త్వరగాముగించుకొని ఊరికివెళ్ళాలండీ. (శశికళ గిరిజా శంకర్ వైపు తిరిగి కూర్చుంటుంది).

జానకి: మీరాజకీయ జీవితం మీభార్యకు చాలా యిబ్బందికరంగా ఉంటు దనుకుంటాను. (వాళ్లేదేదో మాట్లాడుకుంటూంటారు)

శశికళ: (గిరిజాశంకర్‌తో) మీరుకాల్చే సిగరెట్టు ఎంత మంచివాసన వేస్తూందో!

గిరిజాశంకర్: వో. యివా? చాలా ఖరీదైనవండీ. యివి నేను అప్పు డప్పుడూ అప్పుల్లోమునిగిపోయి నప్పుడు మాత్రమే కాలుస్తూంటాను.

శశికళ: అప్పుల్లో ఉండటం బాధకాదూ ?

గిరిజాశంకర్: ఈరోజుల్లో ప్రతివానికీ ఏదోవక వ్యాపకమంటూ ఉండాలికదా! నాకు అప్పులే కనక లేకపోతే నేను ఆలోచించటానికేమీ లేకుండా పోను ?—నేనెరిగిన వాళ్లందరికీ అప్పులున్నాయి.

శశికళ: దాకీదార్లంతా కంగారు పెడుతూంటే మీమనస్సంతా చికాకై పోదూ ?

గిరిజాశంకర్: వాళ్లరాస్తారు. నేనుపలకను.

(రాముడు కవరుతెచ్చి లలితకు యిస్తాడు)

శశికళ: మీరుచాలా వింతమనిషిలాపున్నారు.

లలిత: యిదిగో. జానీ. ఉమలరాసింది : సాయంత్రం వస్తుందట. మళ్లావెంటనే వెళ్లిపోతుందట. నాకు చాలా సంతోషంగా ఉంది ఆమెవస్తుం దంటే; ఎంతచక్కని మనిషనుకున్నావు! ఇదిగో యీదస్తూరీ చూడావా? ఎంత అందంగా వ్రాస్తుందనుకున్నావు! చూడు !

(ఉత్తరం జానకికి యిస్తుంది.)

జానకి: (పరికించి). స్త్రీ దస్తూరీలావేను. స్త్రీ దస్తూరిలో స్త్రీత్వంలేక పోతే నాకేందావుండదు.

(లలిత ఆమెదగ్గర్నించి చీటీతీసికొని బేబిలుమీద ఉంచుతుంది.)

లలిత : అహ్, ఆమెలో నిలువునా స్త్రీత్వం మూర్తీభవించింది. చూస్తావు కాదా. ఆమెను గురించి డాక్టరు సదాశివం నీతోచెప్పే ఉంటాడను కుంటాను ఆమె కలకత్తాలో ఉంటూన్నప్పుడు ఆయనకు తెలుసట ! (లోపల్నించి నౌకరు ఆమెతో మాట్లాడతాడు) సరే పైహాల్లోకా, జానీ, శశీ, లేవండి పోదాం కాస్త టీ తాగివచ్చి కూర్చుందాం.

(అందరూ లేస్తారు. కృష్ణప్రసాద్ యిందిరా వస్తారు. శశికళ కండువా రాధాకృష్ణ తీసుకొస్తానని తీసుకుంటాడు.)

జానకి : రాధా, శశికళ కండువా మీమేనల్లుడు తీసికొస్తాడులే. నీవు నా ఆల్లిక సామానుతీసుకురా.

రాధాకృష్ణ : ఆల్లాగే డియర్

(అంతాపోతారు.)

యిందిర : తమాషా విషయం. అందమైన వాళ్ళెప్పుడూ భర్తలంటే అసూయ పడతారని, సామాన్యులైతే భర్తలంటే తగని అసూయ.

కృష్ణప్రసాద్ : అందమైన స్త్రీ ఎప్పుడూ యితర్ల భర్తలంటేనే అసూయ పడతారు.

యిందిర : జానకిని చూశావా? రాధాకృష్ణ మహాపరివారం పన్నెత్త టానికి వీల్లేదు. ఏడాదిక్రింతవరకూ ఏ క్లబ్బులో చూసినా యీమె చరిత్రే విన బడేది. యిప్పటికి అలసిపోయినట్టుంది అమ్మగారు; మగణ్ణింటిపెట్టుకు పోతోంది.

ప్రసాద్ : యిరవై సంవత్సరాల శృంగారజీవితం స్త్రీని శిథిలా లయంగా చేస్తుంది. యిరవై సంవత్సరాల వివాహజీవితం ఆమెను పబ్లిక్ బిల్డింగ్‌గా మారుస్తుంది.

యిందిర : యిరవై సంవత్సరాల శృంగార జీవితమే! ఎక్కడైనా ఉంటుందా అలా?

ప్రసాద్ : మనరోజుల్లో కాదు. ఈ రోజుల్లో స్త్రీలు చాలా చాలా తెలివైన వాళ్లు. ఆతదానికో హాస్యరసం (Sense of humour) ఏమాత్రం ఉన్నా అదే ఎప్పుడోనాడు శృంగార జీవితాన్ని పాడుచేస్తుంది.

యిందిర : దాన్ని గ్రహించి ఆనందించగల పురుషుడైనా అయ్యుం డాలి కదూ.

ప్రసాద్ : నిజంగా అంతే. గుడిలో లింగంతప్ప గుడిలో పూజ్యవా ళ్ళంతా భక్తిశ్రద్ధలతో ఉండకపోతే మరోలా ఎలా వుంటారు?

యిందిర : ఆరాధకుడు పురుషుడే అయ్యుండాలా?

ప్రసాద్ : పూజా పురస్కారాలు స్త్రీకి శోభించినంతగా పురుషునికి శోభించవు.

యిందిర : రేవతిని గూర్చి ఆలోచిస్తున్నావా? ఆమె అంత అమాయ కంగా మాట్లాడుతుందేం? ఒక్కొక్కసారి పిచ్చిగా కూడా వినబడుతుంది.

ప్రసాద్ : అమాయకతేమీ కాదు. తెలివైందే. కాని పాపం ఒక్కొక్క సారి యెక్కడో ఉంటూ, యిక్కడ మాట్లాడుతూంటుంది. యింకా ఆమె ఆ బెంగాలీవాణ్ని గురించే తలపోస్తూంటుందనుకుంటాను.

యిందిర : మొన్న నతను వచ్చి పెళ్ళిచేసుకోమంటే యీమె తీవ్రంగా నిరాకరించిందని విన్నాను. అతను పాపం చాలా దుఃఖించాడట!

ప్రసాద్ : యీమె యెట్లాంటి భావాల్లో ఉన్నప్పుడు అట్లా నిరాకరించిందో! యీమె భావనా ప్రపంచంలో మునిగి ఉన్నప్పుడు భగవంతుణ్ని కూడా లెక్కచేయదని నేను స్పష్టంగా గ్రహించాను. అప్పుడామెను చూచి తీరాలి.

[మోహన్ ప్రవేశం]

మోహన్ : ప్రసాద్ గారూ, ప్రతివారూ నన్ను చాలా అభినందించారు. నేను మిమ్మల్ని నిరాశ జెందనీయననే అనుకుంటున్నాను.

[సుషిమా ప్రవేశం]

ప్రసాద్ : మోహన్, నీవు ఆదర్శ యువకునిగా పనిజేయాలి.

(అతనితో మాట్లాడుతుంటాడు)

యిందిర : సుషిమా, బొంబాయి మహిళా మీటింగుల కోసం నీకేమీ బెంగగా లేదా?

సుషిమా : నాకు మీటింగు లంటే తగని అసహ్యం.

యిందిర : నాకు చాలా యిష్టం. తెలివైనవాళ్ళెప్పుడూ శ్రోతలుగా ఉండటానికిష్టపడరు. వాళ్లెప్పుడూ మాట్లాడుతూనే ఉంటారు.

సుషిమా : నేను ఇంతలే ఎక్కువగా మాట్లాడుతారనుకుంటున్నాను.

యిందిర : ఉత్త శ్రోతగా ఉండటం నా కెప్పుడూ యిష్టముండదు.

ప్రసాద్ : మోహన్, నీవు నాకు నచ్చకపోతే నిన్ను నా శక్రెటరీగా వేసుకుంటానంటానా? నీవంటే నాకు ఎందుకో ఇష్టమైంది. నీ వెప్పుడూ నాతోనే ఉండాలి. (మోహన్ సుషిమా వెళతారు) మోహన్ అందమైన పిల్లవాడు.

యిందిర : అతను చాలా అందగాడే కాని ఆబొంబాయి పిల్లేమిటి?

ప్రసాద్ : ఏం?

యిందిర : ఆమె విన్నసాయంత్రం నాతో తనకి పట్టి పద్దెనిమిదేళ్లేనని గొంతుచించుకు చెప్పిం... అది పూర్తిగా నమ్మరాని విషయం.

ప్రసాద్ : స్త్రీ ఎవరితోనైనా తననిజమైన వయస్సు చెపుతుందను కోవటం పొరబాటు.

యిందిర : ఆమె పైగా పవిత్రవాది కూడాను.

ప్రసాద్ : అదొక్కటే క్షమించరాని విషయం. ఏఆకర్షణాలేనివాళ్ల పవిత్రవాదులయ్యారంటే క్షమించవచ్చు. కాని సుషిమాలో గొప్ప ఆకర్షణా, అందమూకూడా ఉన్నాయి.

(యిందిర ప్రసాద్ ముఖంలోకి నిశితంగా చూస్తూ)

యిందిర : సుషిమరీ చెడ్డమనిషిలా పోతున్నావేమిటి

ప్రసాద్ : పెద్దవాడంటే ఎట్లా ఉంటాడు, యిందిరా ?

యిందిర : పసిపిల్లల అందానికి మురిసిపోతూంటాడు.

ప్రసాద్ : పెద్ద స్త్రీ అంటే ఎట్టాంటిది ?

యిందిర : మగవానికి విసుగు పుట్టనివ్వని ఆడది.

ప్రసాద్ : అయితే నీవు మంచిదానవే నన్నమాట :

యిందిర : నేను పవిత్రవాదిని మాత్రంకాను.

ప్రసాద్ : స్త్రీలోని పవిత్రతంటే నాకెంతమాత్రం నమ్మకం లేదని నీకు తెలుసా ? ఏ స్త్రీలోనైనా ఉత్సాహకరమైన సమయంలో అనవలసిన రీతిగా 'నిన్ను నేను చాలా ప్రేమిస్తున్నాను.' అంటే ఎల్లాంటి పతివ్రతైనా ఉబ్బి తబ్బిబ్బై పోతుంది.

యిందిర : ఐతే ప్రతి స్త్రీ అట్టాంటిదే నంటావా ?

ప్రసాద్ : చాలా కొద్దిమంది మాత్రం కాకపోవచ్చు.

యిందిర : సుషీమా అట్టాంటిది కాదు.

ప్రసాద్ : అది నీ వెట్లా చెప్పగలవు ?

యిందిర : బాగానే చెప్ప గలను.

ప్రసాద్ : యిప్పుడే నే నామెను ముద్దుపెట్టుకుంటే ఏమి చేస్తుందేమిటి?

యిందిర : నిన్ను పెళ్లైనా ఆడేస్తుంది; లేక పళ్లైనా రాలగొడుతుంది. ఆమె నిన్ను దవడ మీద కొడితే ఏంచేస్తావేమిటి ?

ప్రసాద్ : అట్లాచేసినవాళ్లనే నేను గొప్పగా ప్రేమించవలుగుతాను.

యిందిర : ఆమెతోలికి మాత్రంపోరు. అది నక్షత్రానికి గురిచూడడం వంటిది.

ప్రసాద్ : ఇంతవరకూ నాజీవితంలో విఫలత్వమన్నదివిఎరగను.

యిందిర: స్త్రీలం మేము విఫలత్వాన్నే ఎప్పుడూ ఆరాధిస్తూంటాము.

ప్రసాద్: సఫలత్వమంటే మీకుచాలా భయం. ద్వేషంకూడా ననుకుంటాను. (యిద్దరూ కొద్దిసేపు మౌనం)

యిందిర: ప్రసాద్, ఒకందుకు నీవంటే నాకు చాలా యిష్టం.

ప్రసాద్: ఒక్కందుకే? నాలో అనేక దుర్గుణాలుంటే ఒక్కందుకేనా?

యిందిర: వాటినిగురించి అంతగా గర్వపడకు. ముసలివాడ వయ్యే కొద్దీ అవన్నీ క్రమంగా మాయమైపోతాయిలే.

ప్రసాద్ : నా కెప్పుడూ ముసలివాణ్ణవ్వాలని లేదు. నాఆత్మ పుట్టుకతోనే ముదిమితో పుట్టి యవ్వనంలోకి ఎదుగుతూంది. అదే జీవితానికి కామెడీ.

యిందిర. శరీరం మాత్రం యవ్వనంనోంచి ముసిలితనానికి ఎదుగుతుంది. అదే జీవితానికి ట్రాజిడీ

ప్రసాద్: అదే ఒక్కోప్పుడు కామెడీ కూడాను. సరేనేనంటే నీకు ఎందువల్ల యిష్టమో చెప్పావు కాదు.

యిందిర: వో. అదా! నన్ను చూసిన ప్రతివాడూ నావెంటబడతాడు. ఒక్కనువ్వు మాత్రమే ఎప్పుడూ నన్ను ప్రేమించలేదు. అందువల్లే నీవంటే నాకు చాలా యిష్టం.

ప్రసాద్. నాకు నేనై వెంటబడింది ఒక్కనీవెంటనే.

యిందిర: నిజమే? అయితే సూచనగానైనా తెలియనీయలేదేం?

ప్రసాద్: ఎందుకు? యిద్దరంకూడా బాధపడతాం కనక.

యిందిర: యిప్పుడు మనంబాధల్ని తప్పించుకో గలంగా !

ప్రసాద్, ఒక్కచావును తప్పించుకోలేం గాని, కీర్తి కాసపడకుండా ఉంటే అన్నీ తప్పించుకో గలుగుతాం యీకాలంలో.

యిందిర: కీర్తికోసం ప్రయత్నిస్తున్నావా యిప్పుడు?

ప్రసాద్: అంతఅసహ్యకరమైన విషయం నాకింకోటిలేదు. నేను ఆలోచించ దలచుకోని విషయాల్లో అనే మొదటిది.

యిందిర: నీకెంతయిష్టంలేకపోయినా నిన్ను కీర్తి వరించేలాగుంది.

ప్రసాద్: ఎందుకు నన్నట్లా భయపెడతావు? ........... నేనంటే నీకంత యిష్టమంటున్నావు. అమెరికా వెళ్ళిపోదాం యిప్పుడు వచ్చేస్తావా? .... చెప్పు వస్తావా? ఏం అల్లా చూస్తావేం? చెప్పూ మరి ....?

యిందిర: చెప్తాను నువ్వొ పవిత్రినావిని ముద్దుపెట్టుకుంటా నన్నావు కదూ? ముద్దుపెట్టుకో ముందు; ఆతరవాత చెప్తాను.

ప్రసాద్. సుషిమూనా?

రాముడు: (వచ్చి) పైహాల్లోకి టీ తీసుకోటానికి రమ్మన్నారమ్మగారు,

ప్రసాద్: వస్తున్నామనిచెప్పు.

రాముడు: చిత్తం (పోతాడు).

యిందిర: యిట్లాంటి అల్పానందాలంటే సీకిష్టమే?....

ప్రసాద్: చాలాయిష్టం. జన్మకంతా గొప్ప సంతృప్తినిచ్చే దివ్యానుభూతి కోసం ప్రయాణించే వానికి యివి విశ్రాంతి శిబిరాల్లాంటివి. అయినా, సీకిష్టంలేక పోతే యిక్కడే కూర్చుందాం.

యిందిర: ఆదిమానవులు జీవితమంతా చెట్లకింద గడిపేవారట!

ప్రసాద్: అవును. భవిష్యత్తును గురించి భయపడ్డ మనుష్యులు బంధనాల్లో చిక్కుకొన్నారు .... జా కెట్టుబందు సూచికపోయింది .... అదేంటి? కోపమొచ్చిందా? నేనేంజేశాను?

యిందిర: చీరభద్దరుదే మరేం ఫర్వాలేదు.

ప్రసాద్: యీముడి సరుకులో అందరూ రాణించరు .... కోపమొచ్చినప్పుడు నీముఖం చాలాబావుంటుంది సుమా! మరీ కళ్ళు ....

యిందిర: యింక పోదాం టీకి (లేస్తుంది పోటానికి)

ప్రసాద్: (టేబిలు మీంచి కమల రాసిన కవరు తీసి అడ్రసు పరకాయిస్తూ) యీదస్తూరీ ఎంతబావుందో! యీదస్తూరీ చూస్తూంటే ఎన్నోసంవత్సరాల నాటి నేనెరిగిన ఒకస్త్రీ జ్ఞాపకం వస్తూంది.

యిందిర: ఎవరు?

ప్రసాద్: ఆఁ, ఎవరూలేదు. అంతతెలుసు కోవాల్సిన స్త్రీకాదులే. ఎవరో అనామకురాలు. (కవరు టేబిలు మీదవేశాడు, యిందిరతో మెల్లెక్కుతూ, ఒకరి ముఖంలో కొకరు నవ్వుకుంటారు.

తె ర

# అంకం 2.

దృశ్యం:- భోజనాలైంతర్వాత డ్రాయింగ్ రూములో స్త్రీలంతా సోఫాలమీద కూర్చుంటారు. సుషీమ మూలగా ఏదో చదువుకుంటున్నట్టు కూర్చుంటుంది.

యిందిర : బ్బ! మగాళ్లలోంచి కాసేపిట్లా బయటపడ్డం ఎంత తేలిగ్గా ఉంది !

శశికళ : అవును వాళ్లేమిటి ఎప్పుడూ అసహ్యంగా గుచ్చి గుచ్చి అల్లా చూస్తారూ ? నిజమేనా ?

యిందిర : గుచ్చి గుచ్చి చూస్తారా ? అట్లా చూడడం నాకు చాలా బావుంటుంది.

లలిత : (నవ్వుతూ) నీకు బావుంటుందే ?

యిందిర : మనం ఎదటలేనప్పుడే వాళ్లు చాలా హాయిగా వుంటారు. అందుకే నే నెప్పుడూ ఆలోచిస్తూంటాను; భోజనాలైన తరువాత కాస్సేపు యిట్లా ఊపిరి పీల్చుకోటానికి తప్పితే ఒక్క క్షణం కూడా వాళ్లని ఒంటరిగా వదలేయ కూడదని. అమాయికలం మనం; వాళ్లనెప్పుడూ నీడల్లాగ అంటి పెట్టుకొని ఉండక పోతే మనల్ని వెంటనే వాళ్ళు మర్చిపోతారు.

లలిత : ఏమిటీ ? నీడలా అంటిపెట్టుకొని ఉండాలా ?

యిందిర : అవును లలితా ! అదొక్కటే వాళ్లని సరైన మార్గంలో పెట్టే పద్ధతి....వాళ్ళ ప్రయత్నమంతా యెప్పుడూ మనమంచి తప్పించుకోటానికే.

శశికళ : మనమే వాళ్లనుంచి తప్పించుకోటానికి చూస్తుంటామనుకుంటాను. వాళ్ళవి నిజంగా పాషాణ హృదయాలు. వాళ్లకెంతశక్తి ఉందో వాళ్లకి తెలుసు. దాన్నెట్లా ప్రయోగించాలో కూడా వాళ్లకి బాగా తెలుసు.

జానకి : వాళ్లను సరైన స్థానంలో పెట్టటానికి యింత తికమకలు పడ తారెందుకు ?

యిందిర : ఏది వాళ్లకు సరైన స్థానం ?

జానకి : ఎవరిభార్యను వాళ్ల శ్రద్ధగా చూసుకోవడం.

యిందిర : అంతేనా ? —.... పెళ్లికానివాళ్ళో —?

జానకి : వాళ్ళా ! త్వరగా ఒక భార్యను చూసుకోవాలి. ఈ బ్రహ్మచారి మూకవల్లే సంఘంలో ఘోరమైన అపవాదులు పుట్టడం. వీళ్ళంతా వో సంవత్సరం లోగా పెళ్ళిళ్లు చేసుకోవాలని నిర్బంధిస్తూ ఓ చట్టం పాసౌతోంది.

శశికళ : యింకొకరి పెళ్ళయిన ఆడవాళ్ళ మీద వాళ్ళకు మన సుంటే ?

జానకి : వాహో ! శశీ, అట్లాంటిపరిస్థితిలో ఎవో ఒక గౌరవమైన అమ్మాయిని చూసి ఒక వారంరోజుల్లో పెళ్ళిచేసుకొనేటట్టుచేసి, యితర్ల ఆస్తి జోలికి పోకుండా పాఠం నేర్పాలి.

యిందిర : మనల్ని యితర్ల ఆస్తిగా భావించి మాట్లాడడం నాకేం బాగో లేదు. జానకీ! మగవాళ్లంతా పెళ్లయిన స్త్రీలసొత్తు, పెళ్లయిన స్త్రీలకున్న ఆస్తి ఏమిటీఅంటే, నిజంగా ఆదొక్కటే. కాని మనం మాత్రం ఎవరి సొత్తూకాదు.

శశికళ : చాలా బాగాచెప్పావు యిందిరా, నీవు నిజం మాట్లాడినందుకు నాకు చాలా సంతోషం.

లలిత : జానీ, లెజిస్లేషను నిజంగా అట్లాంటివేవైనా చర్యల్ని తీసుకొంటోందా ? యీరోజుల్లో పెళ్లయినవాళ్లందరూ బ్రహ్మచార్లుగానూ, బ్రహ్మచార్లు పెళ్లయిన వాళ్ల లాగా గడుపుతున్నారని వింటున్నాను.

శశికళ : పెళ్ళైన వాళ్ళెవళ్లో, పెళ్ళికాని వాళ్ళెవళ్లో నాకు నిజంగా తెలియదు.

యిందిర : యింటి బాధ్యతలు వంటబట్టిన మనిషిని చాలా తేలిగ్గా తెలిసికోవచ్చు ననుకుంటాను. వాళ్ల కళ్లలోని విషాదరేఖలే చెప్తాయి. అందులోనూ ఆదర్శ భర్తల్ని వెంటనే పోల్చుకోవచ్చు. వాళ్ల ముఖాల్ని చూస్తుంటే అయ్యో పాపమనిపిస్తుంది ?

లలిత : ఏమిటే ఏమనిపిస్తుంది,

యిందిర : ఏమనిపిస్తుంది? పెళ్ళయిన వాళ్ల జాలిగొలిపేటట్టుంటారు. పెళ్ళికాని వాళ్ళు గర్వంతో మిడిసిపడిపోతుంటారు. వాళ్లదృష్టి అనినంత మేరకు చూస్తుంటారు. మేడలూ, గోడలూ అడ్డలేవు.

లలిత : మాకాలంలో భర్తకీ, యీకాలంలో భర్తకీ చాలా భేదంఉంది. ఎప్పుడూ ఆయన ఎంత ఉత్సాహంగా, ఎంత ఆనందంగా ఉండేవారు!

యిందిర : ఒక విధంగా మా ఆయన ప్రామిసరీ నోటులాంటివాడు.

శశికళ: ప్రామిసరీనోటుకు దఫదఫాలు చెల్లుబెడుతూంటేగాని కాల దోషం పట్టుంచి.

యిందిర, అంటుకే విసుగెత్తి పోతూవుంది.

జానకి. జీవితమంటే అట్లాంటి భావాలున్నదానవునీవు. నీకున్న అభిప్రాయాలతో నీవు పెళ్ళాడావంటే నాకు చాలా ఆశ్చర్యంగావుంది యిందిరా?

యిందిర : నాకూ ఆశ్చర్యంగానే ఉంది, ఎట్లా పెళ్ళికి సమ్మతించానా అని.

లలిత. ఏమిటే నువ్వనేచిందిరా? నీ వివాహ జీవితం ఎంతో సుఖంగా ఉందను కుంటున్నాను యింతవరకూ నేను, కొందరిలా అందరిఎదటా నీఆనంద జీవితాన్ని ఆలపించడం నీకిష్టం లేదేమో, అంతేగాని....

యిందిర : కాదు కాదు, నేను పూర్తిగా మోసపోయాను రావుని గురించి.

లలిత: ఏమిటీ? మోసమా? ఏమిటే అట్లామాట్లాడుతున్నావీవేళ అతని తల్లిని నేను బాగా ఎరుగుదును, ఆమె చాలా దైవభీతి, లోక భీతిగల ఉత్తమురాలు, బారిష్టరు రంగారావుగారి పెద్ద కూతురు.

జానకి. సుందరమ్మా? నాకు జ్ఞాపకం వచ్చింది. ఆమెను నేనూ బాగా ఎరుగుదును. నొక్కు నొక్కుల తల — చిన్న గెడ్డం. అసలు గెడ్డం లేదనే అనిపించేది.

యిందిర : రావుకు మాత్రం గెడ్డం ఉంది. చాలాబలమైన పలకలు దేరిన గెడ్డం.

శశికళ ; పలకలు దేరిన గెడ్డంగల వాళ్ళు చాలా బలమైన వాళ్లయి ఉంటారను కుంటాను. వాళ్ల దండలు మెలికలు తిరిగి ఉంటాయి.

యిందిర: అయితే రావుని నీ వెరిగే ఉంటావనుకుంటాను. యిది కూడా నీకు ముందే చెప్పడం మంచిది. అతనెప్పుడూ సంభాషించడు.

శశికళ : మౌనంగా ఉండేవాళ్లంటే నాకు చాలా యిష్టం.

యిందిర : రావు మౌనంగా ఉండడు, అస్తమానూ మాట్లాడుతూనే వుంటాడు. కాని సంభాషించడు. ఏం మాట్లాడుతుంటాడో నాకేం అర్థమవదు. కొన్ని సంవత్సరాలనుంచీ వినటం మానేశాను.

శశికళ : అట్లాంటి పరిస్థితుల్లో జీవితం గాఢాంధ కారమై పోతుంది.

యిందిర : జీవితమంటే రంగురంగుల యింద్ర ధనుస్సులా కొన్ని కొన్ని ప్రత్యేక సమయాల్లో మాత్రమే గొప్ప గొప్ప సౌందర్యాల్ని ప్రదర్శి స్తుంది. ఆ తరువాతిదంతా కారు మబ్బులతో గాఢాంధకారమే.

లలిత : రావు నీతో ఏమన్నా కఠినంగా మాట్లాడి కోప్పడుతూంటాడా ? అలాంటి మనిషిలా కనబడ్డే పైకి!

యిందిర : ఓ! కాదు; ఎప్పుడూ అతిశాంతంగా ఉంటాడు. ఆ అతిశాం తంతోనే నా నరాల మీదికి తెస్తాడు. లోకమంతా గొప్పగా పొగుడుతూంటే శాంతం, సహనం లాంటి చచ్చుగుణాలు. దయాధర్మంలాంటి పిచ్చి గుణాలు నేటియువకుల్లో గొప్ప ఆదర్శాలై పోయాయి. యిలాంటి మగవాళ్లతో గడపటం ఎంత దుర్భరమైన సంగతో ఆ భరించే ఆడవాళ్లకే తెలుస్తుంది.

శశికళ : ప్రపంచంలో గొప్ప వారందరికీ అగుణాలున్నాయి. అసలు ఆ గుణాలు ఉండడంవల్లే గొప్పవారయ్యారేమో !

యిందిర : గొప్పవాళ్లందరిలోనూ ఒక ఖచ్చితమైన పశుత్వం ఉండక తప్పదు. అదే వాళ్లను గొప్పవాళ్లగా చేస్తుందనుకుంటాను.

శశికళ : అవును, మగవాళ్ల తత్వమేవేరు. వాళ్లది వట్టిజడత్వం, మనలా ప్రతి చిన్నవిషయానికీ చలించరు. అదే తరుచుగా భార్యాభర్తల మధ్య అగాధా నికి కారణ మౌతుంది. కాని యింతకీ రావులో ఉన్న లోటేమిటో చెప్పావుకావు.

యిందిర : అతను నన్ను మొదట కలుసు కొన్నప్పుడు 'నీవు నాదేవ తవు. నాజీవితాంతం నిన్ను తప్ప ఏ స్త్రీనీ ప్రేమించను' అని ప్రమాణం చేశాడు. నేనప్పుడు చాలా చిన్న దాన్ని కాబట్టి ఆమాటల్ని నేనంతగా పట్టించు కోలేదు. ఏ మగవాడైనా అట్లాగే చెప్తాడనుకున్నాను. వివాహమై సంవత్సరం గడిచాక ఆతన్ని గురించి విచారించి చూస్తే అతనా మాటల్ని అక్షరాలా అమలు జరుపు తున్నట్టు గ్రహించాను. ప్రమాణాన్ని ఏ విధంగానూ భంగపరచినట్టు కన

బడ లేదు. అట్లాంటప్పుడు యింకా ఆమనిషితో గడపడం ఎట్లా ? ఎంత దుర్భరం !

లలిత, ఏమిటేవ్ ?

యిందిర : మగవాడెప్పుడూ స్త్రీ కన్యత్వాన్నే వాంఛిస్తాడు. మగవానికి అదొక పెద్ద అహంభావం, మూర్ఖత్వమూనూ. స్త్రీ ఎప్పుడూ పురుషుని అంత్య ప్రణయాన్నే కోరుతుంది. అదే స్త్రీ ప్రకృతిలోని పెద్ద రహస్యం.

శశికళ : నీమాటలు నాకు పూర్తిగా అర్థమయ్యాయి యిందిరా. చాలా నిజం మాట్లాడావు.

లలిత : ఏమిటే నువ్వనేదిందిరా ? రావు ఎప్పుడూ యింకొకర్ని ప్రేమించ లేదని అతనితో నీకు జీవితం దుర్భరమైపోతూ ఉందా ? యిల్లాంటి సంగతి నీవెక్కడైనా విన్నావా జానకీ ! నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది.

జానకి : అందులో మనం ఆశ్చర్య పడవలసిందేమీలేదు. యీరోజుల్లో పెద్ద పెద్ద చదువుల్ని చదివిన స్త్రీలు వివాహజీవితంలో సుఖపడుతున్నా రంటేనే చాల ఆశ్చర్యం / చదువుకున్నవాళ్ళల్లో పెళ్ళాడి సుఖపడుతున్న వాళ్ళని వేళ్ళ మీద లెక్క పెట్టచ్చు.

లలిత : అయితే పెద్ద పెద్ద చదువులే వివాహ జీవితాన్ని విచ్ఛిన్నం చేస్తూంటే మరి ఎందుకంత చదువులు ?

యిందిర : వివాహజీవితం విషమించటానికి పెద్ద చదువుకారణం కానక్కరలేదు. భార్యా భర్తల్లో ఏ ఒక్కరికి ఏ మాత్రం కామన్ సెన్సు ఉన్నా వివాహ జీవితం నరకంగా మారిపోతుంది. అందుకే స్త్రీ ఎప్పుడూ మగవాని కామన్ సెన్సు (Common Sense) తో యుద్ధం చేస్తూంటుంది. మగవానిలో రూపం లేకపోయినా, డబ్బులేకపోయినా, భార్య కావటానికి యిష్టపడుతుంది. కాని, మగవాడిలో ఉండవలసినంత మూర్ఖత్వం లేనివాణ్ని ఏ స్త్రీ కూడా వివాహమాడటానికి అంగీకరించదు.

లలిత : ఏమిటే ? మూర్ఖత్వం లేని మగవాడిని ఏ ఆడది కూడా వొప్పుకోదూ ?

యిందిర : తెలివైన ఏ ఆడది కూడా ఒప్పుకోదు. యీ ప్రపంచంలో ఎవరు సుఖపడ్డారన్నా వాళ్ళు సహజంగా మూర్ఖులైనా అయ్యుండాలి. లేక మూర్ఖత్వాన్ని నటించనైనా నటించాలి.

లలిత : అయితే నీ వుద్దేశ్యం ? మరి ఆదర్శమైన భర్త ఎలా ఉంటాడు ?

యిందిర : హా! ఆదర్శ భర్త! ఆదర్శభర్త మనల్ని దేవతల మంటూ పొగుడుతూ పసిపిల్లల్ని మందలించినట్లు మందలిస్తుంటాడు. మనం తిన కలిగినంత తీపిని మేపుతాడు. మన తీవ్రవాంఛల్ని ప్రతిఘటిస్తాడు. పౌదర్లనీ పరిమళాన్నీ పూసుకోవడం పరమానంద మంటాడు. పక్కకు చూస్తే ముక్కోపౌతాడు. సిల్కుచీరల్ని కట్టుకోమంటాడు. స్నేహితుల యిళ్ళకెళితే వద్దుకో నంటాడు. అతనెప్పుడూ తను గ్రహించిన దానికంటే ఎక్కువ మాట్లాడతాడు. మాట్లాడేకంటే ఎక్కువ గ్రహించానంటాడు.

లలిత : రెండూ ఎట్లా సంభవమౌతాయి ?

యిందిర : ఆ, అదే, అతగాడు ఎంత అందమైన ఆడవాళ్ళను చూసినా సుంతైనా చలించడు. అప్పుడు అందమంటే ఏమిటో అతనికి తెలియదనైనా అనుకోవాలి, లేక అతని ఆదర్శాలు యింకా చాలా గొప్పవి కాబోలు అనైనా అనుకోవాలి. మళ్ళా వాళ్ళని ఎంతో గొప్పగా చూస్తాడు. చివరికి ఎందువల్లో తనకు వాళ్ళు నచ్చలేదంటాడు.

శశికళ : యితరస్త్రీలను గురించి వినటం చాలా తమాషాగా ఉంటుంది కదూ ?

యిందిర : ఎవర్ని గురించైనా మనం ఏ దైనా ప్రశ్న వేస్తే మనల్ని గురించి సమాధానం యిస్తాడు. సవ్యాపసవ్యంగా మనకు లేని యోగ్యత లన్నింటినీ మనకు తగిలించి తెగ పొగిడేస్తాడు. పైగా మనలోని గొప్పను తాను ఒక్కడే చూడగలిగా నంటాడు. మనమెప్పుడూ కలలో కూడా ఊహించి యెరుగని పవిత్రతనూ, పాతివ్రత్యాన్నీ మనలో తాను చూశానంటాడు. నిజంగా అది ఎంత కఠోరమో వినటానికి ? మనకు ఏవైతే కావాలో అవితనకే తెలుసు నంటాడు. మనకు కావలసిందేమిటో మనకు తెలుసని అతనెప్పుడూ నమ్మడు. అది నిజంగా క్షమియించరాని విషయం. మన మెన్నడూ కోరని ప్రతిదీ అంటగట్టి ఉపయోగించుకో మంటాడు.

జానకి : ఆదర్శ భర్త ఒక్క మనబిల్లల్ని చెల్లించడానికే గాని యింకెందుకూ కాదంటావు.

యిందిర : పదిమందీ ఉన్నప్పుడు గొప్పగా పొగిడేస్తాడు. ఒంటరిగా ఉన్నప్పుడు ఒక బానిసను చూచినదానికంటే కూడా హీనంగా చూస్తాడు.

ఏ అవస్థలోనైనా అతనికేమాత్రం ఇష్టంలేని పనిజేసినా వెంటనే తన మానవత్వాన్ని మర్చిపోయి అతి హీనంగా మారిపోటానికి వెనుదీయడు. రాత్రి ఎనిమిది గంటలదాకా మనల్ని ఎంతో ప్రేమిస్తున్నానని చెప్పుతూన్నవాడుఎనిమిదిన్నరకల్లా మనల్ని శాశ్వతంగా విడిచిపెట్టేయటానికి ఏమాత్రం సంశయించడు. మళ్లా తొమ్మిదయే సరికి కాళ్ళమీద బడటానికి సిగ్గుపడడు. యింకా తెల్లవారేలోగా మన బ్రతుకే మౌతుందో ఎట్లా మారిపోతుందో ఎవరూ చెప్పలేరు. యికక్షణక్షణానికీ గండమైన ఆనిర్భాగ్యపు బ్రతుకు సహించలేక ఏప్పుట్టింటికో పోతే, మళ్ళా కబుర్లూ ఉత్తరాలూ, ఏడుస్తూ పుస్తకాలంతేసి ఉత్తరాలు, యింకెప్పుడూ అలా ప్రవర్తించనని ప్రమాణాలు. చివరికి పెళ్ళిళ్ళ స్నేహితుణ్ణో ఏమరిచి పోయిన బంధువుల్నో పంపిస్తాడు. క్షమించడమే స్త్రీకి విద్యుక్త ధర్మమంటూ యీదిక్కు మాలిన వాళ్ళకు హితబోధ చేస్తారు. యికయేగతీలేని స్త్రీ ఆ ఆదర్శ భర్తగారి పాదసేవకు పోకతప్పదు. మళ్లా నెలైనా గడవకుండానే పరిస్థితి మొదటి కొస్తుంది. భార్య ముద్రిపడ్డందువల్ల గతులు కోల్పోయిన యీభూదేవి బిడ్డకు మత్తెక్కించటానికి రోజం ఆమెను ఆదర్శగృహిణీ అని పిలవటం మొదలెడుతుంది. యీలోగా ఆ ఆదర్శభర్త ఈ 'ఆదర్శగృహిణి' యొక్క జీవిత మాధుర్యాన్నంతా లూటీచేసి ఆమె ముఖానికి బురదరాసి నిర్దయగా అడవుల్లోకి నెట్టేస్తాడు. మానవ జీవితంలో మారని సత్యం యిదొక్కటే. ఆదర్శ భర్తల విషయంలో యిన్నాళ్లనాడు జరిగిందే యిప్పుడూ జరుగుతూంది: ..........'ఆది అంటూ ఉందేమోగాని యిక దీనికి అంతమంటూ ఉంటానికి వీలులేదు. ఈ ఆదర్శభర్తలు వాళ్ల కీర్తిని గురించి వింటానికి వాళ్ల చెవులు చాలక పరాయి చెవుల్ని బాడుగకు తీసికొన్నందువల్లే వాళ్లను కట్టుకున్న వాళ్ళ జీవితం మరీ గాఢాంధకారమై పోతుంది.

లలిత : ఎంతగొప్పగా మాట్లాడావే ఇందిరా. యింత యిలా మాట్లాడేస్తావని నేనెప్పుడూ అనుకోలా,

శశికళ : యీ మాటల్ని నే నెప్పుడూ మర్చిపోలేను.

జానకి : అయితే ఆదర్శమైన మనిషి ఎలా దొరుకుతాడో చెప్పావు కావు.

యిందిర : ఎట్లానా ? అనంతమైన నిరీక్షణవల్ల దొరుకుతాడు. అదొక్కటే అతన్ని పొందటానికి సాధనం.

శశి : నా జీవితంలో నే నెప్పటికైనా అలాంటి మనిషిని కలుసుకోగలనా యిందిరా? అలాంటివాడు ఒక్కరినంటే ఎక్కువ ఉండరేమో!

యిందిర ; యీ దేశంలో, ఏ సలుసర్తైమగురు ఉంటే ఎక్కువ లేరు శశీ.

లలిత : హూష్ ఉండవే.

యిందిర : ఏం? ఏమిటయ్యిందే ?

లలిత : (మెల్లగా) సుషిమా ఆ మూలగా ఉందన్న సంగతి పూర్తిగా మర్చిపోయాను. మన మాటలన్నీ ఆమె వింది కాబోలు ఏ మనుకుంటుందో.

యిందిర : విననీ భవిష్యత్తులో ఆమెకు చాలా ఉపకరిస్తాయి.

లలిత : బహూశా ఆమె వినుండదేమోలే. ఏమైనా నేనామె దగ్గరకు వెళ్ళి మాట్లాడటం మంచిదను కుంటాను. (లేచి సుషిమా దగ్గరకు వెళ్ళి) సుషిమా, ఏమిటి చేస్తున్నావ్? (ఆమె పక్కన కూర్చుని) చాలా సేపట్నించి యీ మూలనే కూర్చుండి పోయావేం? పుస్తకం చదువు కొంటున్నావా? యిక్కడ చాలా పుస్తకాలున్నాయే.

సుషిమా : లేదు చదవటం లేదు. మీ సంభాషణ వింటున్నాను.

లలిత : ఆ మాటలన్నీ నమ్మకోకమ్మా! అవన్నీ ఊరికే తమాషాకి అనుకున్న మాటలే.

సుషిమా : అందులో ఏ వొక్క మాటా నేను నమ్మలేదు.

లలిత : అంతేనమ్మా!

సుషిమా : మీ అతిథుల్లో కొందరి మాటల్నివింటుంటే ప్రపంచంలో ఏ స్త్రీలైనా అట్లాంటి జీవితాశయాలు కలవాళ్లు ఉన్నారా అని నమ్మలేక పోయాను.

(కొద్దికాలం మౌనం)

లలిత : మీ వైపు స్త్రీలు ఎంతో శాంతంగానూ, ఎంతో మర్యాదగా మన పల్లెటూళ్ళల్లోలా ఉంటారని మా అబ్బాయి రాశాడు.

సుషిమా : అన్నిచోట్లా ఉన్నట్టే అక్కడా కొంతచెడ్డ లేకపోలేదు. కాస్త పైకి మంచిగా ప్రజాశ్రేయస్సు కోరే సంఘాలెప్పుడూ స్వార్థం కోసం తాపత్రియ పడవు.

లలిత: యిక్కడి వాళ్ళంతా వాకర్నొకరు వేధించుకు తినేవాళ్ళే. యిక్కడి వాళ్ళలో ఒక్క కూలికి పోయేవాళ్ళే సుఖంగా జీవించ గలుగుతారు.

సుషిమా : (లేచి టేబిలునానుకొని నిలబడి) మీలో కొందరి లాంటి వాళ్ళవల్ల సంఘానికి గొప్ప అశాంతి మాత్రం కలుగుతుంది. పోనీ వాళ్లన్నా ఏ మాత్రమైనా సుఖపడు తున్నారా అంటే అదీ కనబడదు. తను పైవాళ్ల నించి ఎట్లా రాబట్టుకోవటమా అని ఆలోచించే కంటే పైవాళ్ళకు తను యింకా యేమివ్వ కలనా అని యోచించించడం వల్ల ఎంత ఆనందాన్ని పొంద వచ్చునో చాలా మందికి తెలియద నుకుంటాను. మీస్థితిలో ఉన్న మనదేశపు స్త్రీలంతా యీ అవస్థలోనే ఉన్నారు. పరదేశస్థుల పాలనక్రింద మీరంతా బాధ్యతా రహితమైన జీవితానికి అలవాటు పడ్డారు. అందుచేత మీరు స్వార్థాన్ని మించి ఏవిధంగానూ ఆలోచించ లేక పోతున్నారు. మీలాంటి భాగ్యవంతు లంతా మీ జీవితం ఎట్లా గడుస్తుందో మీకే తెలియని పరిస్థితిలో ఉన్నారు. ఎట్లా తెలుస్తుంది ? తక్కినదేశాలకీ మీకు మధ్య రాతిగోడలు కట్టుకున్నారు. సహజత్వాన్నీ నిరాడంబరాన్నీ చూసి మీరు నవ్వుకుంటారు. ఇతర్ల రెక్కలపై మీరు బ్రతుకుతూ వాళ్ళంటే అసహ్యించుకుంటారు. అప్పు డప్పుడూ మీరు వాళ్ళకి ఏమైనా చేస్తే కృతజ్ఞతతో కాకుండా కేవలం కృత్రిమ బుద్ధితో వాళ్ళని ఉపయోగించు కోటానికే చేస్తారు.

మీడబ్బులోను, మీతళుకు బెళుకుల్లోను కళా, సౌందర్యమూ ఏమిటో మీకు తెలీకుండా పోయాయి. మీచేతికిచిక్కి నాశనంకాలేని కళా, సౌందర్యమూ మీకు అర్థంకావు. మీనిర్లక్ష్యం మీకళ్ళకు తెరలు కట్టింది. మీమూర్ఖత్వం మీచెవుల్లో సీసంపోసింది. మీఅహంభావంవల్ల అసలు జీవిత రహస్యాన్నే కోల్పోయారు. మీవ్యక్తిత్వత ముఖమల్‌దుస్తుల్లోని రోగిష్టి శరీరంలాంటిది. మీ గొప్పతనం సువర్ణపీఠంమీది శవం లాంటిది. అంతాస్వార్థం, మూర్ఖం, కరుడు కట్టిన స్వార్థం

శశికళ: అంచరూ యిట్లా మాట్లాడగలుగుతారంటే నమ్మటం కష్టం, చాలా చాలా బావుంది, కదూ ?

లలిత: సుషిమా, నీవు మమ్మల్నెంతో ప్రేమించావను కున్నాను. నిన్నిక్కడి గొప్పవాళ్లంతా చాల పొగడుతున్నారు. జానకిరాం విన్నా మీ వాళ్ళనీ చాలాగొప్పగా చెప్పాడు. జానకిరాం నెరుగుదువుకదూ ? సౌందర్యాన్ని అంత గొప్పగా అర్థంజేసుకొనే వాడింకొక డుండడు. గొప్ప ఆర్టిస్టూ గాయకుడూను.

సుషిమా : జానకిరాం తెలుసునాకు, బాగాజ్ఞాపకంఉంది. ముసిముసి నవ్వులతో గతానికి ముసుగులు వేసే కళామూర్తి, అమాయకలోకం! ప్రతివారూ ఆయన్ని యిళ్ళకాహ్వానించేవారు, ఎంతో గొప్పగా. ఆయనవల్ల ఎన్నికుటుంబాలు సర్వనాశనమయ్యాయో ? చూడటానికి కూడా అసహ్యం కలిగేటంత భ్రష్టు లయ్యారు. వాళ్ళని గురించి జాలిపడమనటంలేదు. ఏ స్త్రీ ఐనా తనుచేసిన పాపానికి అట్లా శిక్షఅనుభవించవలసిందే.

[కమల ప్రవేశం]

కాని స్త్రీ పురుషులు కలిసి చేసిన పాపానికిమన ఒక్కరినే శిక్షించటం అన్యాయం. శిక్షిస్తే యిద్దర్నీ శిక్షించాలి. లేకపోతే యిద్దర్నీ విడిచెయ్యాలి న్యాయం. అందరికీ ఒకే విధంగా వర్తించాలి. ఇద్దరు కలిసి చేసిన పాపానికి ఒక్కరేశిక్ష అనుభవించడం మహాఘోరం.

జానకి : ఏదమ్మా సుషిమా, నీవింకా కూర్చోపుకాబోలు, ఆ దింపు యిలా ఇవ్వమ్మా.......ఆఁ థ్యాంక్స్ !

లలిత : (తలతిప్పి కమలను చూసి) కమలా, యిప్పుడా రావటం రా రా. నీవు అసలు వస్తావనుకోలేదు. నా కెంతో సంతోషంగా ఉంది నీరాక, జానకీ, యిదిగో కమల- నా ఆత్మ స్నేహితురాలు. కమలా! జానకి, శశికళ, యిందిరా, యీమె యిప్పుడే యిక్కడివాళ్ల ప్రవర్తనను గురించి మాట్లాడిన సుషిమా. బొంబాయినుంచి వచ్చిన నా స్నేహితురాలు.

సుషిమా : నేను చాలా ఘాటుగా మాట్లాడినట్లున్నాను క్షమించండి, కాని యిక్కడి కొన్ని పద్ధతులు.....

లలిత : లేదమ్మా నీవు చాలా నిజం మాట్లాడావు. నీవు చెప్పిందంతా అక్షరాలా నిజం. కాని జానకిరాం గురించి నీవు కొంత కఠినంగా మాట్లాడావు. అతన్ని నీవు సరిగా అర్థం జేసుకోలేక పోయావను కుంటాను. అతను చాలా మంచివాడు. జానకి తమ్ముడే.

సుషిమా : సారీ (Sorry) నాకాసంగతి తెలీదండీ.

జానకి : సుషిమా, నీవు మాతమ్ముణ్ని గురించి చెప్పినదాట్లో ఒక్క మాట కూడా అబద్ధంకాదు. కాని అతనింట్లో తెలివైన వంటవాళ్లున్నారు.

లలిత : యిదిగో సుషిమా! నీవు యిప్పటివరకూ మేము నిరాడంబరాన్ని చూసి నవ్వుకుంటా మన్నావు. కమలను చూశావుకదా! ఎన్నిసార్లు పిలిచినా ఎప్పుడోకానిరాదు. అది నాతప్పుకాదు. కమలంటే నా కెంత యిష్టమో.

యిందిర : భోజనాలయ్యాక కూడా మగవాళ్లింత సేపు ఏం జేస్తు న్నారో !

శశికళ : మనల్ని గురించి చాలా అసహ్యంగా మాట్లాడుకుంటున్నా రను కుంటున్నాను. బయటికి వెళ్దామా ?

యిందిర : ఆ. ఏమైనా యీ ముసుగుల్లోంచి బయట పడటమే మంచిది. (లేచి శశికళతో పోతూ) మేము కేవలం నక్షత్రాల్ని చూట్టానికే పోతున్నాం.

లలిత : వో. మీకాక్కావలసినన్ని చూడగలరు. కాని మంచులో ఎక్కువ సేపుండకండి జలుబు చేస్తుంది. (కమలతో) మోహన్ చాలా సేపైంది వెళ్ళి.

కమల : కృష్ణప్రసాద్ మోహన్ని శత్రుటరీగా వేసుకుంటా ననటం నిజమేనా ?

లలిత : నిజమే కమలా! అతనికి మోహనంటే చాలా ఇష్టం. అతనంటే చాలా గొప్ప అభిప్రాయముంది. కృష్ణప్రసాద్ని నీవెరగవను కుంటాను.

కమల : నేనెప్పుడూ అతన్ని చూడలేదు. యీ ప్రపంచంలో నేనెరిగిన వాళ్లు చాలాకొద్ది మంది. ఎన్నో సంవత్సరాలక్రితం ఎవరో ప్రసాద్ గోదావరీ తీరాన ఉండేవారని జ్ఞాపకం.

లలిత : ఆ, ఆ, అతనే. చాలా విచిత్రమైన మనిషి. నీవు తప్పకుండా చూడాలి. అతని పినతల్లిదో మేనత్తదో ఎవరిదో నాకు సరిగా జ్ఞాపకం లేదు. ఏదో పెద్ద ఆస్తి యీమధ్య కలిసింది. చాలా మంచి మనిషి. కాని మన బొంబాయి స్నేహితురాలు ఎవర్ని గురించైనా చాలా చెడుగా ఊహిస్తూంటుంది.... నీ అభిరుచుల్ని బట్టి చూస్తే అతను నీకు నచ్చుతాడో నచ్చడో నేను చెప్పలేను. జానకీ! అతను దీర్ఘాలోచనలో శ్రద్ధ కనబరుస్తాడా ?

జానకి : ఏమో, నాకు తెలిసినంతవరకూ అట్లాంటిదేమీ విన లేదు.

లలిత : మనందరికీ తలో అభిరుచీనీ. కదూ ? అయినా ప్రసాద్ చాలా గొప్పస్థితిలో ఉన్నాడు కాబట్టి ఎవరైనా ఏమైనా సహాయం కోరితే కాదన లేడను కుంటాను. ఎట్లాగైనా యిప్పటివరకూ యింకా అతను యువకుడే; ప్రసాద్ తండ్రి పోయి ఎంత కాలమౌతుందే జానీ ?

జానకి : నాలుగైదేళ్ళవుతుందేమో. ఎప్పుడూ, మాతమ్మునికీ రాగిణికీ ఉన్న సంబంధాన్ని గురించి పత్రికలన్నీ గగ్గోలు పెట్టిన సంవత్సరమే రామ లింగ ప్రసాద్ పోయాడు,

లలిత : అవునవును; జ్ఞాపకం వచ్చింది. నాలుగేళ్ళకు పైగా అవు తుంది. అంతకు ముందు సంవత్సరమే గంగాధర ప్రసాద్ చచ్చిపోయాడు; వేటలోనో, బోటుషికారులోనో ఎప్పుడో సరిగ్గా జ్ఞాపకంలేదు. అతను పోయిన రెణ్ణెల్లకే సరోజినికి మగబిడ్డ పుట్టాడుకాని పాపం రెణ్ణెళ్లైనా దాటకుండానే ఆబిడ్డ కూడా పోయాడు. సరూ చాలా దురదృష్టవంతురాలు, యింతకీ కృష్ణప్రసాద్ గొప్ప అదృష్టవంతుడు. భువనేశ్వరికి చిన్నకొడుకంటేనే ఎక్కువ ప్రేమగా ఉండేది.

కమల : భువనేశ్వరి ?

లలిత : ఆఁ! భువనేశ్వరి కృష్ణ ప్రసాద్ తల్లి! చాలా గొప్ప యింటి బిడ్డ! నాచిన్నతనంలో ఆమె లాంటి అందమైన వాళ్ళెక్కడా కనీసం మన (భాగ్యవంతుల) యిళ్ళల్లో లేరనే చెప్పుకునేవారు.

కమల : మోహన్ ఎక్కడున్నాడో కొంచెం వాడికి కబురు పెడతారా ?

లలిత : ఓ! తప్పకుండా నౌకర్ని పంపుతా. మగవాళ్లంతా యింత సేపూ భోజనాల దగ్గరే ఉండిపోయారెందుచేతో. రాముడూ, ఓ రాముడూ,.... కృష్ణప్రసాద్‌ని నేను చాలా చిన్నప్పట్నుంచీ ఎరుగుదును. అప్పుడు అతను సరదాగా ఉండేవాడు. కాని చాలా తెలివిగా హుషారుగా ఉండేవాడు. వాళ్ల తండ్రికిఇతనంటే పడేదికాదు. ఒక్క దమ్మిడీ కూడా చిక్కనిచ్చేవాడు కాదతనికి. తల్లికి మాత్రం యితనంటే చాలాయిష్టం. చాటుగా యితని అవసరాలకి సరిపడే డబ్బు అందిస్తూండేది, హాఁ! డాక్టరు సదాశివంగారు. (నౌకరుతో) అక్కర్లేదు వెళ్ళు.

[ప్రవేశం రాధాకృష్ణ, డాక్టరు సదాశివం.]

(రాధాకృష్ణ శశికళ ప్రక్కగానూ, సదాశివం లలిత ప్రక్కనా కూర్చుం టారు.)

సదాశివం : కృష్ణప్రసాద్‌గారు అద్భుతమైన మనిషి. నా జీవితంలో ఆయన్ని మరిచి పోలేను. (కమలను చూసి) ఓ కమలా,

లలిత : (సదాశివంతో) చూశారా. కమలను ఎట్లాగయితేనేం యిక్క డికి రప్పించ గలిగాను.

సదాశివం : పార్వతి ఎన్నిసార్లు కారు పంపించినా కమల ఒక్కసారి కూడా రాలేదు.

లలిత : ఏం, మీతో పార్వతి రాలేదేం ? మామూలుగా ఆమెకు తల నొప్పులు ప్రారంభించాయా ?

సదాశివం : అవునండీ అదొక దారుణ నరకం. అలాంటప్పుడు ఆమెను ఒంటరిగా ఉంచటం కంటే చేయగలిగిందేమీ లేదు.

జానకి : (ఆమెభర్తతో) రాధా ! (రాధాకృష్ణ భార్య దగ్గరకు వెళ్ళి కూర్చుంటాడు. డాక్టరు సదాశివం లలితతోనూ కమలతోనూ మాట్లాడుతూం టాడు. కృష్ణ ప్రసాద్ లోపలినుంచి వచ్చి వీళ్ళను గమనించకుండా కిటికీలో నుంచి బయటతోటలోకి చూస్తున్న యిందిర దగ్గరగా వెళ్తాడు. కిటికీకి మరో ప్రక్కగా శశికళ ఉంటుంది. యింతసేపూ కమల కృష్ణప్రసాద్‌ను పరికిస్తూ ఉంటుంది.)

కృష్ణప్రసాద్ : జగదేక లావణ్యవతి ఎట్లాఉంది ?

యిందిర: (శశికళచేయి తనచేతిలోకితీసుకొంటూ) మాకిద్దరికీ యిక్కడ చాలా హాయిగా ఉంది. థాంక్స్ మిష్టర్ ప్రసాద్‌గారూ. భోజనాల హాల్లోంచి అంత త్వరగా వచ్చాశారేం ? యిప్పుడేకదూ పాపం మీరు భోజనానికి కూర్చుంట ?

ప్రసాద్ : అబ్బ, చచ్చేలా 'బోర్' చేశారు. యింత సేపుగా పెదవులు బిగపట్టి కూర్చున్నాను. నిజంగా చాలాసేపట్నించి నీకోసం రావాలనే అను కుంటున్నాను.

యిందిర : రావలసింది. ఆబొంబాయి పిల్ల ఉపన్యాసం వినగలి గుదువు.

ప్రసాద్ : నిజంగా ? బొంబాయి మహిళాసంఘం వాళ్లంతా ఆవిద్యలో ఆరితేరిన వాళ్ళే. అ^ సకేమీ సందేహంలేదు. అసలా వాతావరణమే అట్లాంటి దనుకుంటాను. దే.. గురించి ఆ ఉపన్యాసం ?

యిందిర : . నితీను గురించి?

ప్రసాద్ , నామె తల తిరిగి పొయ్యేలా చేస్తాను. నాకెంత కాలం గడువిస్తావు ?

యిందిర : . రం రోజులు.

ప్రసాద్ : ౬ వం: అనవసరం అంతకాలం.

[ప్రవేశం: మోహన్‌కుమార్ గిరిజాశంకర్]

మోహన్ : (కమల దగ్గరకు వెళ్ళి) అమ్మా ! ఏం....

కమల : నావంట్లో ఏమీ బావూలేదు. యింటి దగ్గర నీతో మాట్లాడాలి. అసలిక్కడికి రావలసింది కాదు నేను.

మోహన్ : అమ్మా, వెళ్లిపోయే ముందొకసారి నీవు ప్రసాద్ గారిని చూడాలి. (ప్రసాద్ దగ్గిరకి వెళ్తాడు.)

కమల : యిప్పుడు కాదు మోహన్.

మోహన్ : ప్రసాద్ గారూ మాఅమ్మను చూస్తారా ? యిప్పుడే యిక్కడకు వచ్చింది. మళ్లా వెళ్లి పోతుందట !

ప్రసాద్ : ఓ, మహాసంతోషంతో (యిందిరతో) యిప్పుడే వస్తాను; ప్రజల తల్లులంటే నాకు ప్రాణం మీదికి వస్తుంది. తల్లి బ్రతికున్నంత కాలం స్త్రీ లోకమంతా వీళ్లకు తల్లులుగానే తయారౌతుంది. యిది ఎంత దుఃఖకరం !

యిందిర : ఆమె అతనికే తల్లికాని, అందరికీ కాదుకదూ ?

ప్రసాద్ : యీ రాత్రి నీవు ఎంత చక్కని 'మూడ్'లో ఉన్నావో! (ప్రక్కకు తిరిగి మోహన్‌వెంట కమల దగ్గరకు వస్తాడు. కమలను గుర్తించిన ఆశ్చర్యంలో క్షణకాలం నిశ్చేష్టుడై కొద్దిగా వెనుకకు తగ్గి మెల్లగా కళ్లను మోహన్ వైపుకు తిప్పుతాడు)

మోహన్ : అమ్మా, వీరే కృష్ణప్రసాద్‌గారు. వీరే నన్ను తమ శక్రెటరీగా తీసుకొన్నారు. ప్రసాద్ గారికి నమస్కరించవే అమ్మా !

కమల : కృష్ణప్రసాద్‌గారు చాలా మంచివారు నాయనా యీక్షణాల్లో నీమీద చాలా అభిమానం చూపించారు.

ప్రసాద్ : (మోహన్ భుజాలపై తన చేతులువేసి) మోహనూ - నేనూ గొప్ప స్నేహితులం; కమలగారూ

కమల : ప్రసాద్‌గారూ, నాకొడుకు ఏవిధంగానూ మీకు స్నేహితునిగా తగడు.

మోహన్ : అల్లా అనకే అమ్మా. ప్రసాద్‌గారు చాలా తెలివైన వారు. వారావిధంగా ఎప్పుడూ అనుకోరు.

కమల : పిచ్చి నాయనా.

మోహన్ : జీవితమంటే ఏమిటో వీరికి తెలిసినంతగా నేనెరిగిన వాళ్లెవరికీ తెలియదు. ప్రసాద్‌గారూ, నేను మీదగ్గరున్నంతసేపూ ఉత్త పనికి మాలిన వాణ్ణను కొంటూంటాను. (కమలతో) నాకున్న అవకాశాలు చాలా తక్కువ. నేను M.A. ను కాను. B.A. నూ కానూ. అయినా అదేమీ గమనించకుండా నన్ను శక్రటరీగా తీసుకొన్నారంటే కేవలం నామీద వారికున్న అభిమానమే ననటానికి సందేహ మేముందే అమ్మా ?

కమల : వారి మనస్సు మారటానికి క్షణకాలం కూడా పట్టదు.

మోహన్ : అమ్మా !

కమల : వారి శక్రటరీగా ఉండటానికి తగిన యోగ్యతలు నీకు లేవన్న సంగతి జ్ఞప్తికి తెచ్చుకో.

యిందిర : ప్రిసాద్‌గారూ, ఒక్కసారి యిలావస్తారా? ఒక్కనిమిషం మీతో మాట్లాడాలి.

ప్రిసాద్ : ఒక్కసారలా వెళ్ళివస్తా; మీరుక్షమిస్తారా కమలగారూ ? మోహన్, మన వ్యవహారం అంతా రైటయి పోయినట్టే గదూ ?

మోహన్ : అంతే ననుకొంటున్నానండీ. (ప్రసాద్ యిందిర దగ్గరకు వెళ్తాడు).

యిందిర : ఆ నల్లచీరనింక విడిచి పెట్టవేమో అనుకున్నాను.

ప్రసాద్ : ఆమె ఎంత అందంగా ఉందో చూశావా ?

(కమల వేపు చూస్తాడు)

లలిత : జానీ, మనమంతా వోసారి హాల్లోకి వెళ్దాం పదండి. అక్కడ సుషీమా వీణతో పాడుతుంది. నీవుకూడా రా కమలా, ఏం వస్తావా ? (సదాశివంతో) సుషిమా సంగీతం పార్వతి తప్పకుండా విని తీరాలి. ఏదో వో సాయంత్రంవేళ సుషిమాను అక్కడికి తీసుకొచ్చి ఆమె వినే యేర్పాటు చేస్తాను. వో! ఆమెకిప్పుడు సరిగ్గా వినబడటం లేదనుకుంటాను. ఆమెకు చెవుడు చాలా ముదిరి పోయిందని విన్నాను. నిజమే ?

సదాశివం : అఁ నిజమే. ఆచెవుడుతో నాప్రాణాలు కూడా తీసేస్తూంది. ఏదైనా చదవమంటుంది. ఎంతగొంతు చించుకొని చదివినా ఆమెకు వినబడదు. పైగా నేను నోట్లో నోట్లో గొణుక్కుంటున్నానని తమ సణుక్కుంటూ కూచుంటుంది.

లలిత : నే నెప్పుడు చూసినా చదువుతూనే ఉండేది యిదివరకు.

సదాశివం : పెద్ద అచ్చులో ఉంటే తనే చదువుకుంటుంది. చిన్నఅచ్చు ఆమెకు కనబడదు. ఆమెకు దృష్టి దోషం యింకా ఎక్కువై పోతూంది క్రమంగా.

మోహన్ : (కృష్ణప్రసాద్‌తో) మీరు....మీరు-సంగీతం వినటానికి వెళ్లే ముందు కొద్దిగా మా అమ్మతో మాట్లాడండి. మీరు చెప్పిందంతా పట్టి తమాషా అనుకొని ఆమె నమ్మటంలేదు.

యిందిర : అయితే రావా ?

ప్రసాద్ : నిమిషాల్లో వచ్చేస్తా. మోహన్ తల్లితో కొద్దిగా మాట్లాడి వచ్చేస్తా. మీరంతా వెళ్లండి లలితా.

లలిత : నీయిష్టం వచ్చినంత సేపుమాట్లాడవచ్చు. మోహన్‌పై నీకున్న దయకు ఆమె ఎంతో కృతజ్ఞత చూపుతుంది. ఆమెను ఎక్కువసేపు మాత్రం నిలిపేయకు. ఆమెలేకపోతే మాకేం బావుండదు.

జానకి : రాధా! (అంతా నిష్క్రమణ, వీణావాద్యం వినబడుతూంటుంది.)

ప్రసాద్ : మోహన్ మనబిడ్డ అని తెలిసినప్పటినుంచీ నాకు చాలా సంతోషంగా ఉంది....ఏం కమలేమిటి, నిర్మలా ?

కమల : ఎప్పేరైతే మాత్రమేం? నాలాంటి దాని కేపేరైనా ఒక్కటే.

ప్రసాద్ : మోహన్‌కి మీతండ్రిపేరు పెట్టావను కుంటాను.

కమల : ఆయన హృదయాన్ని భగ్నంచేసిన నేను చేయగలిగిందల్లా అదొక్కటే.

ప్రసాద్ : నిర్మలా, ఎందుకదంతా తిరగ తోడటం, నాకు మన పిల్ల వాడంటే మహానందంగా ఉంది. యింతవరకూ నా జీవితం - ఏదో అసం పూర్ణంగా వెలితిగా కనబడేది. మోహన్‌తో ఆ వెలితి తీరిపోయి సంపూర్ణమై పోయింది. ప్రజలందరికీ మోహనంటే నా అంతరంగిక కార్యదర్శి....నాకు మాత్రం పెన్నిధి, ఒక నిగూఢనిక్షేపం.

కమల : మోహన్ని మీదగ్గరుంచు కోటానికి మీకే విధమైన హక్కూ లేదు. మోహన్ నాబిడ్డ. నాదగ్గిరే ఉంటాడు.

ప్రసాద్ : నిర్మలా ! పద్దెనిమిదేళ్ళనుంచి నీ దగ్గరే ఉంచుకున్నావు; యిప్పట్నుంచి కొద్దికాలం నా దగ్గర ఉండకూడదా ? మోహన్ నీకెంత కొడుకో నాకూ అంతే.

కమల : కొడుకును ఆకలితో చావమని నిర్దాక్షిణ్యంగా దరిద్ర దేవత వొడిలోకి నెట్టిన మీరేనా యిప్పుడు మాట్లాడుతున్నది ?

ప్రసాద్ : నిర్మలా, అదంతా మర్చిపో! దానికంతా నీవే కారణం. నేను కాదు నిన్ను విడిచి పెడత, నీవేనన్ను విడిచి పోయావు.

కమల : అవును నేనే; బిడ్డపుట్టేముందు వివాహానికి నిరాకరించిన మీ ముఖం చూట్టానికి యిష్టంలేక నేనే వెళ్ళిపోయాను.

ప్రసాద్ : అప్పుడు నాకు కేవలం యిరవై యేళ్ళు మాత్రమే. ఆ చిన్న వయస్సులో, ఆ ఆరంభ యవ్వనం నన్నంతదూరం ఆలోచించనీయలేదు. పైగా నీకంటే ఎంతో పెద్దవాణ్ని కూడా కాదు, బాధ్యతల్ని గుర్తించటానికి.

కమల ; పెద్దపనుల్ని చేయటానికి చాలిన వయస్సు మంచి పనులను చేయటానికి చాలదనటం హాస్యాస్పదం.

ప్రసాద్ : నిర్మలా! గతాన్ని గురించి యిప్పుడు వాదించడం అనవసరం ! నిన్నూ, బిడ్డనీ, ఆకలికి అహూతిచేశా ననటం కేవలం కోపంతో అంటూన్న మాటలు, శుద్ధఅబద్ధం. మాఅమ్మ నీకు నెలకు ఆరువందలిస్తానంది. కాని నీవు కనబడకుండా వెళ్ళిపోయావు. ఒక్క పైసా కూడా తీసుకోకుండా....

కమల : అవును. ఆమెనించి ఒక్క పైస కూడా తీసికోవటం నాకిష్టం లేదు. కాని మీ తండ్రిగారి సంగతి మాత్రం వేరు. మనం బెంగుళూరులో వుండగా నన్ను పెళ్ళి జేసికోవటం మీ విధని మీ ముఖం ఎదుట చెప్పారు.

ప్రసాద్ : విధి! ఒకరికి విధిగా కనబడ్డదే మరొకరి కింకొక విధంగా కనబడొచ్చు. అయినా అప్పుడు మాతల్లి మాటకెదురు చెప్పలేకపోయాను. ఆవయస్సులో ఎవరైనా అంతే.

కమల : నేను యిప్పుడదే చెప్పబోతున్నాను, మోహన్ కూడా యిప్పుడు వాళ్ళమ్మ చెప్పినట్టే చేస్తాడు.

ప్రసాద్ : నిర్మలా, ఏమిటది ?

కమల : మోహన్ మీతో ఉంటానికి వప్పుకుంటానని మీరెట్లా నమ్మ గలిగారు? మోహన్ నాబిడ్డ.

ప్రసాద్ : మనబిడ్డ. (గుప్పెళ్లు పిసుక్కుంటాడు అశాంతిగా)

కమల : ఎవరు నాయవ్వనాన్నీ, నాజీవితాన్నీ నాశనం జేసి క్షణక్షణమూ నా గుండెల్లో మెదులుతూ నా దుఃఖాన్ని అనంతంజేస్తున్నారో వారితో నా మోహన్ని పంపటమా? సిగ్గుతోనూ అవమానంతోనూ దహించిపోతూ, ఉన్న పదిమందికీ దూరమై, ఆఖరికి ఒక్క స్నేహితురాలైనా లేక, చివరికి ఏమూల నించీ దయాపూరితమైన ఒక్క సానుభూతి వచనంకూడా వినబడక, ప్రచండ ఝంఝూ మారుతం మధ్య చిగురుటాకులా రెపరెప కొట్టుకుపోతూ, యింత వరకూ గడిపాను; నేటికి-

ప్రసాద్ : నిర్మలా! నీగడచిన జీవితంకంటే మోహన్ గడపబోయే జీవితం ఆలోచనీయాంశం. అది నీవు గమనించటంలేదు. నీ భూతకాలం కంటే వాడి భవిష్యత్తు ముఖ్యమన్నది నీకు స్ఫురించటంలేదా ?

కమల : నాభూత కాలంనించి నాబిడ్డ భవిష్యత్తు వేరు కాలేదు. అట్లా ఎప్పటికీ జరగదు.

ప్రసాద్ : అదే జరిగితీరాలిప్పుడు. నిర్మలా, నీవెక్కడో ఊహాప్రపంచంలో ఉండి మాట్లాడుతున్నావు. నీమాటల్లో స్వార్థం గడ్డకట్టినట్లు కనిపిస్తూంది. ఒక్కసారి స్వార్థాన్ని తొలగించి సరైన దృష్టితో విషయాన్ని పరికించమని ప్రార్థిస్తున్నాను. నిన్ను విడవడమా, నన్ను విడవడమా అన్నది అప్రస్తుతం. వాడిభవిష్యత్తు ఉజ్వలంగా ప్రకాశించడానికి ఏది దోహదమిస్తుందో ఆలోచించు. యిప్పుడువాడు చేస్తున్నదేమిటి? తాలూకాఆఫీసులో అరవైరూపాయల గుమస్తాపనా ? వాడికది ఎంతటి నరక ప్రాయమో నీకు తెలీటంలేదా ?

కమల : నిన్ను కలుసుకొనే వరకూ వాడికది చాలా తృప్తిగానే ఉంది.

ప్రసాద్ : నీ వన్నట్టు, నేనే వాడి అసంతృప్తికి కారణమేమో. ఒకమనిషికైనా, ఒక దేశానికైనా, అసంతృప్తే అభివృద్ధికి మొదటి మెట్టు. వాడు నిరాశలో దహించుకు పోతూ నిలబడి పోవటం నేను సహించలేను. అందుకే నేను వాణ్ని నాప్రైవేటు శక్రటరీగా వేసుకుంటానన్నాను.......... అందుకు ఏ యువకుడైనా ఎగిరి గంతేసి వప్పుకొనేటట్టే వాడూ వప్పుకున్నాడు. యీ సంబంధమే కొన్నాళ్లకు మమ్మల్నిరువుర్నీ తండ్రీ కొడుకులుగా ప్రక

టిస్తుంది. కాని నీవూహ ప్రకారం జరిగినట్లయితే వాడి భవిష్యత్తంతా అంధ కారమయమై పోతుందనటానికేమాత్రం సందేహంలేదు. నీ మాటల్ని బట్టి నీకింతకు ముందు తెలియని ఏకొత్త వాడైనా యీ విధంగా అడిగినట్లయితే తక్షణం మోహన్‌ని వాడికూడా పంపటానికి సందేహించ వనుకుంటాను. యింతకీ వాడు నారంక్త కాబట్టి నాతో పంపటానికి నీవు వప్పుకోవటం లేదు. నీవు ఎంత అసమంజసంగా మాట్లాడుతున్నావో నీకు తెలీటంలేదు.

కమల : ఏమైనావాణ్ణి నేను విడిచి పెట్టలేను.

ప్రసాద్ : నా offer వాడు స్వీకరించకుండా చేయటానికి నీవు వాడి కేకారణం చెబుతావ్? నేను వాడికేమౌతానో అది ఎప్పుడూ చెప్పనుగదా? యిక నీవు కూడా చెప్పటానికి ఎన్నడూ సాహసించవు. నీకూ తెలుసు. చూడువాణ్ని ఎట్లా పెంచావో....

కమల : సద్బుద్ధితో ఉండేలా పెంచాను.

ప్రసాద్ : సరిగా అంతే; కాని దానిఫలిత మేమిటి? ఎప్పుడోప్పుడు యిదంతా వాడికి తెలిసినప్పుడు నిన్ను నిర్దయగా విచారించి, అన్యాయమైన శిక్షకు గురిచేస్తాడు. నిన్ను నీవే మోసగించుకుంటున్నావు నిర్మలా! పిల్లలు పసి తనంలోనే తమ తలిదండ్రులెట్లాంటివాళ్లైనప్పటికి ప్రేమించగలుగుతారు, వాళ్ళు పెద్దవాళ్ళయి మంచి చెడ్డల్ని విచారించ గలిగిన వయస్సొచ్చాక యిది కొత్తగా తెలిస్తే క్షమించటం చాలాకష్టం.

కమల : ప్రసాద్, ఏమైనా నాబిడ్డను నానించి తీసుకోకు. నిన్ను వేడు కుంటాను. యిరవైసంవత్సరాలు దుఃఖాన్ని అనుభవించాను. నానిరాశా జీవితంలో నన్ను ప్రేమించే యీవొక్కచిన్న ప్రాణిని నానించి తీసికొని నాబ్రతుకు మరీ గాఢాంధ కారంచేయకు.... నీకు నేనంటే.... కనీసం జాలైనాలేదా? నీకుజీవితంలో కావలసినంత సంతోషం, సౌఖ్యం, అభివృద్ధీ ఉన్నాయి.... యింతకాలం నీవు మమ్మల్ని గురించి ఒక్క క్షణంకూడా ఆలోచించలేదు. అందుకు నిన్ను నిం దించటంలేదు. అసలు నీజీవిత సిద్ధాంతాలేవేరు. యిన్నాళ్ళకి యిప్పుడు కలుసు కున్నామూ అంటే యిదికూడా కేవలం ప్రమాదవశాత్తూను. యిదొక దైవదుర్ఘ టన. నాదౌర్భాగ్య జీవితానికి జాలిపడి భగవంతుడు నాకు ప్రసాదించిన యీనా చిన్నబాబును నానుంచి వేరుచేయకు. నన్నుయింకా దోచుకోటానికి ప్రయత్నించి నన్ను పిచ్చిదానిగా వీధుల్లోకి నెట్టబోకు. నీకు నేనంటే జాలైనా లేదా? ప్రసాద్ నన్ను విడిచిపెట్టు. నామోహాన్ని నానుంచి వేరుచేయకు.

ప్రసాద్ : ప్రస్తుతంవాడి భవిష్యత్తుకు నీతో ఎంత మాత్రం అవసరం లేదు. నాతో వాడి భవిష్యత్తు పరిపూర్ణం కాగలదు. నీకింత కంటే ఏమీ చెప్ప లేను.

కమల : నేను వాణ్ణి విడిచిపెట్టను.

ప్రసాద్ : ఇదిగో, మోహన్ ఆ విషయం....తనంతట తానే నిర్ణయించు కోవాలి.

[మోహన్ ప్రవేశం]

మోహన్ : అమ్మా, ప్రసాద్‌గారితో అంతా మాట్లాడేశావా ?

కమల : లేదు.

ప్రసాద్ : కొన్ని కారణాలవల్ల నిన్ను నాతో పంపటానికి మాతల్లి యిష్టపడటంలేదోయ్.

మోహన్ : కారణమేమీటమ్మా ?

కమల . నీవు నన్నువిడిచి పోవటానికి యింత ఆతురత పడతావని నేనెప్పడూ అనుకోలేదు, బహుశా నాదగ్గర ఉండటం నీకు యిష్టంగా ఉండేమో.

మోహన్ : ఏం మాటలేఅమ్మా అవి. శాశ్వతంగా నేనునీదగ్గర ఉండ గలిగే కంటే నేనింకకోరే దేదీలేదు; ఏమానవుడు కూడా ఎల్లప్పుడూ తల్లిదగ్గరే ఉండలేడు....నీవునన్ను చూసిగర్వపడ గలిగేటంతటి గొప్పస్థితిలో ఉండాలని వాంఛ. ఈ సదవకాశాన్ని సరిగా వినియోగించు కోనీ....

కమల : మోహన్ : నీవు ప్రసాద్‌గారి అంతరంగిక కార్యదర్శిగా తగవను కుంటున్నాను. అందుకు తగ్గయోగ్యతలేవీ నీకులేవు.

ప్రసాద్ : యింతవరకూ నేను జోక్యం కలిగించుకోవటం బావుంద దనుకున్నాను. కమలగారూ, మీచివరి మాటలవల్ల నేనూమాట్లాడవల సొస్తోంది. మోహన్‌కు ఉన్నయోగ్యతలతో నేను తృప్తిపడ్డాను. కాని మీరేవేవో అర్థంలేని మాటలతో నేనిచ్చేహోదాను స్వీకరించకుండా చేస్తున్నారు. ఎందువల్ల మీరట్లా చేస్తున్నారో నాకర్థం కావటంలేదు.

మోహన్ : అమ్మా, చెప్పువారేదో అడుగుతున్నారు.

ప్రసాద్ : చెప్పండి కమలా! ఏదైనా కారణముంటే నేనుండగానే. మళ్ళా పదేపదే అడగడం అనవసరం.

మోహన్ : అమ్మా !

ప్రసాద్ : పోనీ నేనుండగా మీ అబ్బాయికి చెప్పటానికిష్టం లేక పోతే నేనిప్పుడే బయటికి వెళ్తా.

కమల : అక్కర్లేదు. మరోకారణమేమీ లేదు.

ప్రసాద్ : అయితే మోహన్, యింకంతా నిర్ణయమై పోయినట్టే. రా, మనం డాబామీదికి పోయి కాస్త సిగరెట్టు కాల్చు కుందాం. కమలగారూ మీరు చాలా దూరాలోచనతో ప్రవర్తించారు. [మోహన్‌తో వెళ్ళిపోతాడు. ముఖంలో చెప్పరాని వేదనతో కమల కదలకుండా నిలబడి పోతుంది.]

తె ర



# అంకం 3.

దృశ్యం : లలితా రామారావు గారి బంగాళా లోనే ప్రక్కహాల్లో కృష్ణప్రసాద్ సోఫాలోనూ, మోహన్ కుర్చీలోనూ.

కృష్ణప్రసాద్ : మీ అమ్మ చాలా అభిమానవతోయ్ మోహన్. నాకు తెలుసు చివరికామె వప్పుకుంటుందని.

మోహన్ : మా అమ్మ ఏం చేసినా చాలా ఆలోచించే చేస్తుందండి. ఆమె భయమంతా మీ కళత్రిటరీగా ఉండటానికి తగ్గచదువు నాలో లేదనే. నిజంకూడా అంతే. స్కూల్లో నే నెప్పుడూ మొద్దబ్బాయిలా వుండేవాణ్ని ఆఖరుకు బ్రతకడానికి సరిపడే ఏ చిన్ని ఉద్యోగమైనా దొరకటానికి తగ్గ పరీక్షకూడా ప్యాసవలేక పోయాను.

ప్రసాద్ : మోహన్ పరీక్షల్లో ఏమీ విలువలేదోయ్. అసలు మంచి ప్రకృతి గల మనిషైతే అతనికంతా మంచిగానే పరిణమిస్తుంది. చెడ్డ ప్రకృతి గల మనిషికంతా చెడ్డగానే పరిణమిస్తుంది.

మోహన్ : కాని ప్రపంచానికి నేనంటే ఏం లెక్క ?

ప్రసాద్ : భయపడకు మోహన్. ప్రపంచంలో రంటే అద్భుతమైన ఒకశక్తి నీలో ఉందిప్పుడు....యౌవనం. యవ్వనానికి మించింది మరొకటిలేదు. మధ్య వయస్కులు జీవితానికి తాకట్టు పడ్డ వస్తువుల్లాంటి వాళ్ళు. ముసలి వాళ్ళు జీవితానికి నిరుపయోగమైన వస్తువుల్లాంటి వాళ్ళు. కాని యవ్వనం జీవితానికి ప్రభువు లాంటిది. యవ్వనం కోసం స్వర్గలోకపు సింహాసనం సిద్ధంగా ఉంటుంది. కాని కొందరు ప్రజలు జీవితంలో యవ్వన దశంటూ రాకుండానే ముసలివాళ్లైతారు. అట్లాంటిది వింటేనే దిగులేస్తుంది, మోహన్ యిటు విను.

వ్యాయామం, ఉపయాస్నే లేవటం, సంఘానికి ఉపయోగ కరమైన మనిషిగా బ్రతకడం ఒప్పు. యవ్వనాన్ని అరికి సంపాదించటానికి నేను చేయని పనం టూ లేదు.

మోహన్ : కాని మీరు ముసలి వారుకారుగదూ ?

ప్రిసాద్ : నీ యంత కొడుక్కు తండ్రి నవటానికి తగిన వయ స్సుంది.

మోహన్ : నాకు మా తండ్రి జ్ఞాపకం లేదండి. చాలా సంవత్స రాల క్రిందటే చనిపోయాడట !

ప్రసాద్ : తెలుసు. లలిత కూడా అలానే చెప్పింది.

మోహన్ : ఎందువల్లనో మా అమ్మ ఎప్పుడూ మా తండ్రిని గురించి మాట్లాడదు. అందుకని మా అమ్మ ఎవరో కులం తక్కువ వాణ్ణి వివాహమాడింది కాబోలనుకుంటూంటాను.

ప్రసాద్ : (కొద్దిగా బాధపడుతూ) నిజమేనా ? మోహన్ దగ్గరికి వెళ్ళి అతని బుజాల మీద చేయివేసి) మోహన్ నీకు తండ్రిలేని లోటు కన బడుతూంటుందనుకుంటున్నాను.

మోహన్ : లేదండి. మా అమ్మ అట్లాంటి లోటెప్పుడూ కనబడ నీయలేదు. మా అమ్మలాంటి అమ్మ ఎవరికీ ఉండదండి.

ప్రసాద్ : అవునది నాకు తెలుసు. కాని చాలా మంది తల్లులు వాళ్ల కొడుకుల్ని అర్థం చేసుకోరు. అంటే జీవితంలో వాళ్ల కొడుకుల కోరికలేవిటో అవగాహన జేసికోలేరు. మోహన్, నీ జీవితమంతా ఎలక ్కన్నం లాంటి ఆ తాలూకా ఆఫీసులోనే గడపలేవు, గదా ఏం ?

మోహన్ : అది తలుచుకుంటేనే భయం వేస్తూంది.

ప్రసాద్ : మాతృప్రేమ హృదయానికి గొప్ప శాంతినిచ్చే మాట నిజమే, కాని, అది తరుచుగా స్వార్థంతో నిండి ఉంటుంది. నేననేదేమిటంటే అదంతా కేవలం స్వార్థపరత్వమేనని.

మోహన్ : (మెల్లగా) అంతేననుకుంటా.

ప్రిసాద్ : మీతల్లి చాలా ఉత్తమస్త్రీ. జీవితాన్ని గురించి ఉత్తమ స్త్రీల ఉద్దేశాలు చాలా సంకుచితంగా ఉంటాయి. వాళ్ళప్రపంచం చాలా చిన్నది. వాళ్ళ ఊహలు చాలా నిరర్థకమైనవి. అవునా ?

మోహన్ : అవునండీ. మనందేనినైతే అసలు లెక్కచేయమో వాళ్ళు దానినే ఎంతో గొప్పగా బ్రహ్మారథం పడుతూంటారు.

ప్రిసాద్ : మీఅమ్మ చాలా సనాతన మతస్థురాలను కుంటాను. అంతా పూర్వకాలంమనిషిలాగుంది.

మోహన్ : ఓ, ఆమె రోజుకు రెండుసార్లైనా దేవాలయానికి వెళ్తుంది.

ప్రిసాద్ : ఆ, అదే, ఆమెలో నవ్యత్వం ఏమాత్రమూలేదు. నవ్యత్వమే యీరోజుల్లో అతి ముఖ్యమైన విషయం. మోహన్, ఆధునికంగా ఉండా మన్న కోరిక నీకుందా ? నిజమైన జీవితమంటే ఏమిటో తెలుసుకోవాలన్న వాంఛ నీకుందా ? అట్లాఐతే బూజుపట్టిపోయిన పాతసిద్ధాంతాల్ని బయటకి నెట్టేసి, ఆధునిక సంస్కార సంఘంలో కలిసి మెలిసి తిరగటానికి తగ్గ అర్హత సంపాదించుకోవటమే తరువాయి. మద్రాసులో గొప్ప విందు చేయగలిగిన మనిషి ఈరాజధాని నంతనీ పాలించ గలుగుతాడు. ఒక్కొక్కప్పుడు యీ దేశా న్నంతనీగూడా. భవిష్యత్తంతా అట్లాంటి డాబురాయళ్లదే. అట్లాంటి వేషగాళ్ళే యిప్పుడీ దేశాన్ని పరిపాలించ బోతున్నారు.

మోహన్ : గొప్ప గొప్పదుస్తుల్ని ధరించి గొప్పగా ఉండాలన్న కోరిక నాకెన్నాళ్లనుంచో ఉంది. కాని ఏమనిషైనా తను ధరించే దుస్తుల్ని గురించి అంత ఎక్కువగా ఆలోచించడం అంత మంచిదికాదని అందరూ అంటుంటగా చాలా సార్లు విన్నాను.

ప్రిసాద్ : అజ్ఞానులైన [illegible] మనప్రజలకు ఆడంబరంలోని ఆంతర్యం తెలియటంలేదు. యిదిగో చూడు మోహన్! [illegible]ఎట్లాకట్టుకోవాలో నీవు కూడు నేర్చుకోవాలి. బటను బెజ్జాల [illegible] నీవేనాండం [illegible]. కాని పై మాత్రిం చాల గొప్ప ఆకర్షణీయంగా ఉండాలి. ఆకర్షణీయంగా పై కట్టట మంటే జీవితంలో మొదటిమెట్టును ఎక్కడమన్నమాట.

మోహన్ : (నవ్వుతూ) ఎట్లా కట్టుకోవాలో నేర్చుకోవాలండీ. మీరు మాట్లాడేలా నే నెప్పటికీ మాట్లాడలేననుకుంటాను. అసలు నాకు మామూలుగా మాట్లాడటమే చేతకాదు.

ప్రిసాన్ ! ప్రతి స్త్రీతోనూ గొప్పగా ప్రేమిస్తున్నట్లు మాట్లాడు. ప్రతి మగవాని యెదుటా చాలా విసుగు జెందుతున్నట్లు నటించు. అలా చేశావంటే ఒక్క సంవత్సరం నాటికి నీపేరు సంఘంలో మోగిపోతూం టుంది.

మోహన్ : సంఘంలో కలిసి పోవటం చాలా కష్ట మనుకుంటా కదండీ ?

ప్రిసాన్ : సంఘంలో నీవు కలవనక్కర్లేదు. సంఘమే వచ్చి నీలో కలుస్తుంది. అందుకోసం సంఘాన్ని మేపనైనా మేపాలి. లేక సంఘం అదిరి పోయేటట్టన్నా ప్రవర్తించాలి, అంతే.

మోహన్ : సంఘంలో కలిసిమెలిసిఉండడం చాలా ఆనందంగాఉంటుంది కదండీ.

ప్రిసాన్ : సంఘంలో కలిసి మెలిసి ఉండేజీవితం భరించరాని భారమై పోతుంది. దానిలో కలసి ఉండకపోతే చాలా చిక్కులు పడవలసివస్తుంది. సంఘం, అవసరానికి పనికివచ్చే ఒక వస్తువు లాంటిది. అభివృద్ధిని వాంఛించే ఏమనిషికైనా తన వెనుక కొందరు స్త్రీలు ముఖ్యావసరం. స్త్రీలే సంఘాన్ని పాలి స్తూంటారు. సిఫార్సుకుతాళంవేసే ఆడవాళ్లుగనక లేకపోయినట్టయితే నీవు తక్షణం ఒక కిరాణాదుకాణం పెట్టుకోటం మంచిది.

మోహన్ : ఆడవాళ్ళని అర్థంజేసుకోటం చాలా కష్టం, కదండీ ?

ప్రిసాన్ : వాళ్ళని అర్థంజేసి కోవాలని ఎన్నడూ ప్రయత్నించబోకు స్త్రీలు ఉత్తబొమ్మలు. పురుషులు సమస్యలు. స్త్రీ ప్రకృతిని అర్థం జేసికోటానికి ప్రయత్నించడం అపాయంతో కూడుకున్నపని. ఆమెచెప్పేది వినకుండా ఆమె చేసేది మాత్రం చూడు.

మోహన్ : కాని స్త్రీలు చాలాతెలివైనవాళ్లు. అవునాండి ?

ప్రిసాన్ : వాళ్ళతో ఎప్పుడూ అట్లానే అంటూండాలి. కాని యింత వరకూ స్త్రీ చరిత్ర గమనిస్తే స్త్రీబుద్ధి బలంతో సాధించినదానికన్నా కన్నీళ్ళతో సాధించిందే ఎక్కువగా కనబడుతుంది.

మోహన్ : అంతకంటె స్త్రీకి మరోనున్నత మార్గంలేదా ?

ప్రిసాన్ : సౌందర్యం, అదితప్ప మరోమార్గ మేదీలేదు.

మోహన్ : స్త్రీలలో అనేక రకరకాల వాళ్ళుంటారు గదండి ?

ప్రసాద్ : సంఘంలో రెండు రకాలవాళ్ళే ఉంటారు సాధారణం. రంగేళీ రకం.

మోహన్ : వాళ్లలో మంచివాళ్లుకూడా ఉంటారుగదండీ ?

ప్రసాద్ : ఎక్కువగా ఉండరు.

మోహన్ : స్త్రీలు మంచిగా ఉండగూడదంటారా మీరు ?

ప్రసాద్ : వాళ్ళతో అట్లా ఎవ్వరూ అనకూడదు. తక్షణం అంతామంచి వాళ్లైపోయి కూర్చుంటారు, భరించలేం. స్త్రీలు మంచిచెడ్డల్ని గురించి ఎప్పుడూ ఊహించనే ఊహించరు. వాళ్ళెప్పుడూ యితరుల్ని భ్రమపెట్టి ఆకర్షించటానికే చూస్తూంటారు; లేకపోతే వాళ్లనుచూస్తే వాళ్ళకే అసహ్యం కలుగుతుంది. ఏ స్త్రీకైనా భరించలేని పరిస్థితులు వచ్చాయంటే మంచి చెడ్డల విషయం పూర్తిగా మర్చిపోయి తప్పకుండా తిరగబడుతుంది.

మోహన్ : మీరు పెళ్ళిజేసుకోలేదు గదండి ప్రసాద్‌గారూ ?

ప్రసాద్ : మగవాడు పూర్తిగా అలసిపోయినప్పుడూ, స్త్రీ కోర్కెలతో కుతూహలపడుతూన్నప్పుడూ పెళ్లిచేసుకుంటారు. అప్పుడు యిద్దరికీ ఆశాభంగమే.

మోహన్ : అయితే పెళ్ళాడిన వాళ్లెవళ్ళూ సుఖపడటం లేదంటారా ?

ప్రసాద్ : పూర్తిగా సుఖపడవచ్చు. కాని వివాహితుని సౌఖ్యం, మోహన్, కేవలం తను వివాహమాడిని వాళ్లమీదే ఆధారపడి ఉంటుంది.

మోహన్ : ఎవరిమీదైనా ప్రేముంటేనో ?

ప్రసాద్ : ఎప్పుడూ సహజమే ఎవరిమీదో ఒకరిమీద ప్రేముండటం. అందువల్లనే వాళ్లని పెళ్లాడగూడదు.

మోహన్ : ప్రేమ చాలా అద్భుతమైంది గదండీ ప్రసాద్‌గారూ.

ప్రసాద్ : అవును. తనను తాను మోసగించు కోవటంతో ప్రేమనాటకం ఆరంభమై మరొకర్ని మోసగించడంతో అంతమౌతుంది. దాన్నే ప్రపంచమంతా శృంగారమంటుంది. గొప్ప సౌందర్యంతో నిండిన శృంగారం యీరోజుల్లో చాలా అరుదైపోయింది. అది కొన్ని కేవలం నిర్వ్యాపకులకే ఉంది. యీ

సోమరివర్గంవల్ల దేశానికి అదొక్కటే ఉపయోగం. పూర్వంనుంచీ మాకుటుంబం అందుకు ప్రసిద్ధి.

మోహన్ : మీ కుటుంబం ?

ప్రసాద్: అహాఁ అవును. మాకుటుంబం గురించి నీవుతప్పకుండా తెలుసుకోవాలి. అది నీకు భవిష్యత్తులో చాలా ఉపయోగపడుతుంది. మోహన్! నీవునాతో పరిపూర్ణమైన నూతన జీవితాన్ని ప్రారంభించబోతున్నావు. అసలు జీవితాన్ని ఎంత ఉన్నతంగా ఎంత సౌందర్యంగా గడపాలో ముందునీవు తెలుసుకోవాలి. (కమల కుడివైపునుంచి వచ్చి చూసి తిరిగి వెళ్లబోతుంది.) మూర్ఖమానవులలో తయారైన యీ ప్రపంచంలో బుద్ధి ఉన్నవాళ్లకూడా బ్రతకవలసొస్తోంది.

[ఎడమ వైపునుంచి లలిత, డాక్టరు సదాశివం ప్రవేశం.]

లలిత : హో, ప్రసాద్ యిక్కడున్నారా మీరిద్దరూ? మోహన్‌కి అప్పుడే అతని బాధ్యతల్ని గురించి బోధిస్తూన్నట్టున్నావ్.

ప్రసాద్ : మంచిమంచి సిగరెట్లతో బాటు మంచిమంచి సలహాలను కూడా యివ్వటం బాపుంటుందిగదూ ?

లలిత : ఆసమయంలో నేను కూడా యిక్కడుండి నీ సలహాలను వినలేనందుకు నాకు చాలా విచారంగా ఉంది. కాని నీ నుంచి నేర్చుకోటానికి యిప్పుడునేను చాలా ముసలిదాన్నయి పోయాననుకుంటాను. యిప్పుడు ఎవర్నీ గూడా వినలేను; ఒక్క డాక్టరుగార్ని మినహాయిస్తే. డాక్టర్, మీరు సిల్కు సూట్లో ఉన్నప్పుడు మిమ్మల్ని చాలా వినబుద్ధేస్తుంది. మీరేమి మాట్లాడబోతారో నాకు ముందే తెలుస్తూంటుంది. అయినా నాకు విసుగేయదు. (కమలను చూసి) వో కమలా, రా, యిలా మా దగ్గరికిరా, రా, కమలా, (కమల వస్తుంది) మోహన్, ప్రసాద్‌తో చాలా సేపట్నించి మాట్లాడుతున్నాడు. యిక నీ కష్టాలన్నీ గడిచి పోయాయి కమలా, ఏం ? యింక నీవేమీ మోహన్ని గురించి విచారించనక్కర్లేదు. బ్బ! కాస్సేపు కూర్చుందాం (కూర్చుంటారు) ఆ నీ అల్లికపని ఎలా ఉంది ?

కమల . ఎప్పుడూ పనిచేస్తూంటాను లలితా.

లలిత : (డాక్టరుతో) పార్వతికి ఎంబ్రాయిడరీ అంటే అంత యింటరెస్టు (Interest) లేదనుకుంటాను. ఏం ?

డా. సదాశివం : ఎంబ్రాయిడరీ అంటే యింటెరెస్ట్. కాని తెరలు తెరలుగా వచ్చేదగ్గు ఆమెను సూదితో పని చేయనీదు. ఆమె ఫ్లోర్ ముట్టు కుని పది సంవత్సరాలైంది. అయినా ఆమె అనేక యితర విధాల ఉత్సాహంగా గడిపేస్తూంది. అన్నిటికంటే ఆమె ఆరోగ్యాన్ని గురించి పట్టిన శ్రద్ధగా ఉంటుంది.

లలిత : బ్బా ! ఆరోగ్యం సరిలేకపోతే మనస్సెప్పుడూ చెదిరి పోతూం టుంది. ప్రసాద్; ఏమిటీ, నీ వింతావరకూ మోహన్‌తో మాట్లాడుతూంది? అదేమిటో మాక్కూడా చెప్పుదూ ?

ప్రసాద్ , ఏ ముందీ ? ప్రపంచమెప్పుడూ తనుగడిచిన సుఖ గాధల వైపు తేలిగ్గా నవ్వుకొంటూంటుంది. గుండె పగిలిపోయేంత భరించగలిగే ఉపాయం కేవలం అదొక్కటే. దాని ఫలితమేమౌతుందంటే దాని సుఖ గాధల్ని మాత్రం కావ్యాలుగా అల్లుకొని పాడుకుంటూ మత్తెక్కి పోతూ ఉంది. దీన్నే మోహన్‌కి సరిగా అర్థమయ్యేలా చెబుతున్నాను.

లలిత : యిప్పుడు నేను దేన్నికూడా లోతుగా ఆలోచించ లేకున్నాను. అందులోనూ ప్రసాద్ ఎప్పుడే విషయాన్ని గురించి మాట్లాడుతూన్నా అంతే. మానవ సంఘం మరీ అజాగ్రత్తగా ఉంది. నేను మునిగి పోతూ ఉంటే చూస్తూ వుందిగాని, అది నాకెప్పుడూ రక్షణయివ్వలేదు. అయినా దాన్నిగురించి నేను స్పష్టంగా ఏమీ చెప్పలేను. ప్రసాద్, నాకు తెలుసు; నీ వెప్పుడూ పాపాత్ములవైపునే వాదిస్తావు. నేను మాత్రం పవిత్రుల పక్షానే నిలబడటానికే ప్రయత్నిస్తూంటాను. నాకు సాధ్యమైనంతవరకూ. అంటేఅది కేవలం నా ఊహాగానమే ననుకో.

ప్రసాద్ : పాపులకు పవిత్రులకూ కేవలం ఒక్కటే తేడా. ప్రతి పాపాత్మునికీ భవిష్యత్తుంటే ప్రతి పవిత్రునికీ గతముంటుంది.

లలిత : ఇంకనే నొక్క మాటకూడా మాట్లాడలేను. కమలా, సీతా, నాకూ మాత్రం యీ కాలం సరిపడదు. ప్రసాద్ భావంలో మనం ఏకీభ వించలేం. జాగ్రత్తైన కుటుంబ పద్ధతుల్లో పెరిగిన మనుష్యుల అభిప్రాయాల్ని వింటూంటేనే భయమేస్తూంటుంది. చిన్నప్పట్నుంచీ జాగ్రత్తగా పెంచబడ్డ వాళ్ళని చూస్తే యీరోజుల్లో అందరికీ ఎగతాళిగా ఉంటుంది.

కమల : ప్రసాద్‌గారి ఉద్దేశాలలో ఒక్కటీ గూడా ఒప్పుకో లేనం దుకు నాకు చాలా విచారంగా ఉంటుంది.

లలిత : అప్పుడు కమలా మనం ఎప్పటికీ వప్పుకోలేం (మోహన్ విసుగ్గా ఫిడేల్ని కుంచిస్తాడు)

[జానకి ప్రవేశం]

జానకి : లలితా, రాధ ఎక్కడున్నాడు ?

లలిత : అతన్ని గురించి నీవంత ఆతృత పడటం అనవసరం జానీ. చాలా సేపైంది నేను చూసి; శశికళా అతనూ అద్దాలగదిలో ఉన్నారు. వాళ్ళిద్దరూ ఏదో రహస్యంగా మాటలాడుకుంటున్నారు. వెళుతున్నావా, అక్కడికి? నీ వెంటను. ఇక్కడ కూర్చో రాదు కాస్సేపు?

జానకి : కొద్దిగా పనుంది లలితా. (పోతుంది)

లలిత : ఎల్లప్పుడూ మగవాళ్లను గురించి ఆలోచించడం అంతమంచిది కాదు. అయినా అతన్ని గురించి జానకి యిప్పుడింత ఆతృత పడటానికి కారణం ఏమీ కనిపించదు. జానకి గొప్పసానుభూతి పరురాలు. ఏ విషయానికైనా ఆమె సానుభూతి చూపుతుంది; విషయభేదం గమనించకుండా, సానుభూతి చూపగలశక్తి ఎంత గొప్ప ప్రకృతికదూ ?.... ....

[ ప్రవేశం: రాధాకృష్ణ, యిందిర ]

హో ! యిదుగో రాధాకృష్ణ. యిందిరతో. నేను రాధాకృష్ణతో మాట్లాడుతూంది శశికళనుకున్నాను. (రాధాకృష్ణతో) మీకోసం జానకి నాలుగు మూల్లా గాలించేస్తూంది.

యిందిర : ఆమెకోసం మేముచూస్తూ కూర్చున్నాం సంగీతంగదిలో.

లలిత : ఓ! సంగీతం గదిలోనా ! నేను నాపడకగదిలో వనుకున్నా మిమ్మల్నిచూస్తే: నాజ్ఞాపకశక్తి అంతకంతకూ మరీహీనమై పోతూంది. పార్వతికింకా మంచి జ్ఞాపకశక్తి ఉందనుకుంటానేం డాక్టరుగారూ ?

డా. మహాశివం: ఆమె జ్ఞాపకశక్తి చాలా అద్భుతమైంది. ఆమెకు చివరిసారి టైఫాయిడ్ వచ్చినప్పటినుంచీ ఎక్కువగా చిన్నప్పటి సంగతులే మాట్లాడుతూంది. అదే ఆమెకు చాలా ఆనందంగా ఉంది. ఆ జరిగి పోయినగాధల్ని తిరగదోడుతూ ఆమె అమితానందం పొందుతూంటుంది.

[ ప్రవేశం: శశికళ, మినిష్టరు చెంచయ్య. ]

లలిత : శశీ,యింతసేపట్నించీ నువ్వూ చెంచయ్యగారూ మాట్లాడుతూన్న విషయ మేమిటి ?

శశికళ: ప్రభుత్వం థియేటర్లలో పొగతాగటాన్ని నిషేధిస్తూ ఒక బిల్లును పాస్ చేసిందటా........ అప్పుడే ప్రసాద్‌గారి మొఖం ఎలామారి పోయిందో. భయపడకండి. అదీ దేవదాసీ బిల్లులాంటిదే నట లెండి....

లలిత: (నవ్వుతూ) అయితే ప్రసాద్‌లాంటి వాళ్లకు చాలాయిబ్బందే పాపం.

ప్రసాద్: యిబ్బంది పడదలచుకున్నవాణ్ణి స్వర్గంలో వదలి నాయిబ్బంది పడతాడు. నాలాంటి వాణ్ని నరకంలోవేసినా సుఖంగానేఉండగలుగుతాడు. ప్రభుత్వం యిట్లాంటి బైరాగి ఆదర్శాలను ప్రదర్శించి ప్రజలసానుభూతి చాలా తేలిగ్గా కొట్టెయ్యొచ్చను కుంటుంది గాబోలు. యింకా ఆడవాళ్ల తలజు మన్నగా గొరిగించుకొనేలాగ మగవాళ్ళు మీసాల్ని గడ్డాల్ని పెంచుకొనేలాగ మరోశాసనం చేసేస్తే, యిక మన దేశానికి డిఫెన్సు అవసరంకూడా ఉండదు.

శశికళ: అసలీ బిల్లుకు మూలకారణమేమిటో తెలుసా? (చెంచయ్య సైగలతో చెప్పవద్దని బతిమాలుకుంటూ భుజాలు కుంచించుకుంటూ చేతులు నలుపుకుంటూ యించుమించుగా ఏడుపు మొగం పెడతాడు) పరవాలేదండి చెంచయ్యగారూ. ప్రసాద్ గారితో చెప్పడానికేం? మీకింత భయమెందుకు (అంతా చెంచయ్య వేపు అనుమానంగా చూస్తారు. చెంచయ్య ముఖం కిందికి వేలేస్తాడు.)

లలిత: చెప్పుశశీ, ఏమిటి? చెంచయ్యగారికేం?

శశికళ: ఏం లేదు. వారిప్పుడు నాతో చెప్పేటప్పుడు కొద్దిగా రహస్యంగా ఉంచమని చెప్పేరులే. యిక్కడ మనలో మనకి తెలిసినా, రహస్యంగా ఉండక ఏమౌతుంది? ఓరోజున ప్రిమ్మినిష్టరు భార్య M. L. A. గుట్టి అమ్మాళు, సినీమాకు వెళ్ళారట! అక్కడ వీళ్ళిద్దరి పక్కగాను హోకాలేజి ప్రిన్సిపాల్ కూర్చున్నాడట! ఆయన పేరు చెంచయ్యగారు చెప్పలేదు. ఆయనపెద్ద సిగార్ అంటించి పొగ వీళ్లమీదకు వదులుతూండేవాడట! వీళ్ళు ఆయన్ని సిగార్ పారేయ్ మన్నారట! అందుకాయన నిర్లక్ష్యంగా నవ్వుతూ, 'ముందుముఖాన్ని శుభ్రమైన నీళ్లతో కడుక్కొని రండి. అహాయిచెట్టు వాసనకి నా నోరంతా చప్పనైపోతూంది. పోన్ని ముద్దుగా నా నోట్లో పడ్డంత యిదిగా 'ఫీ'లౌతున్నాను. ముందుగా మీరాపని చేస్తే నాసిగార్ పారేయటానికేమీ అభ్యంతరం లేదన్నాడటాయన!

ప్రసాద్ : హూ !

యిందిర : నెలదాటకుండా శాసనం తయారై పోయింది. ఆయన పుణ్యమాంటూ !

లలిత : యిదంతా నిజమే ?

ప్రసాద్ : యిది నిజంకాక పోయినా నిజం దీనికెంతో దూరంలో ఉండదు.

యిందిర : జమీందారీ బిల్లింకా అమల్లోకి రాలేదేమండీ చెంచయ్యగారూ ?

చెంచయ్య : నష్టపరిహారంగా వారికివ్వటానికి చాలినంత ధనం ప్రస్తుతం లేదండీ. వచ్చే సంవత్సరానికి తప్పకుండా వచ్చేస్తుంది. కాబట్టి....

యిందిర : జమీలు తీసుకుని డబ్బు యిచ్చేటట్టయితే ఆబిల్లుయొక్క ప్రయోజన మేమిటండీ 'కాబట్టి' ? (నవ్వు)

ప్రసాద్ : (చెంచయ్యకేసి పక్కగా చూస్తూ నవ్వుతూ) యీనాడు మాకు నష్టపరిహారం యివ్వకుండా మాకున్నదంతా తీసికొంటే రేపు మరో ప్రభుత్వం 'యక్సుమినిష్ట్రి బి'ల్లంటూ వోటు ప్రత్యేకంగా పెట్టేసి యీనాడు తెగబలిసిన యీ మినిష్టర్ల నందర్నీ చివరిబొట్టు వరకూ పిండేస్తారని భయం. అదెట్టాను తప్పదనుకుంటా.

చెంచయ్య : మీరు మాట్లాడే దేమిటో నాకర్థమవటంలేదు.

ప్రసాద్ : యిదిమరీ ఆశ్చర్యం !గిడసబారిన ప్రభుత్వానికి గీతాపారాయణ మొక్కచాంట్లోనే అర్థం కనబడుతుందను కుంటాను. అదీనటనేఐతే అగాధంలో కూలటం తప్పదు.

లలిత : యిందిరా, మరి మీరు మాట్లాడుకున్న విషయమేమిటి ?

యిందిర : బహు భార్యాత్వాన్ని గురించి.

లలిత : అది చాలా ముఖ్యవిషయమే. కాని మాట్లాడటానికేముంది ?

యిందిర : యిటాంటి విషయాల్లో కొండజాతులవాళ్ళే చాలానయం. యీ నాగరిక ప్రజలకంటె అన్ని విషయాల్లోనూ వాళ్లే నయం.

లలిత : ఏమిటి చేస్తారువాళ్ళు?

యిందిర : స్వేచ్ఛగా ప్రతీదీ చేస్తారు.

లలిత : తృప్తే ఆనందానికి కారణం. కదండీ డాక్టరుగారూ? ప్రపంచం లోని మానవ ప్రకృతంతా వొకటే.

ప్రసాద్ : ప్రపంచంలోని మానవులను రెండురకాలుగా విభజించ వచ్చు. దొరికిన ఏవస్తువుతోనైనా తృప్తిపడగలవాళ్లు, ఎంత గొప్పవస్తువు దొరికినప్పటికీ తృప్తిలేనివాళ్ళూను.

యిందిర : నీలాంటివాళ్లు ఆరెంతో వాళ్లు.

ప్రసాద్ : అవును నాకై నేనే ఆశ్చర్య పడుతూంటాను. అందు చేతనే జీవించటానికి నాకు హక్కు ఉందనుకుంటూంటాను.

యిందిర : అంత నీకైనీవే ఆశ్చర్యపోతూండటానికి యిప్పుడేం చేస్తున్నా వేమిటి ?

ప్రసాద్ : నాప్రకృతిలో అందమైన యోగ్యతల్ని ఒకొక్కటీ పరి కిస్తున్నాను.

యిందిర : హో! ఒక్కసారే పరిపూర్ణవ్యక్తిగా మారిపోకు సుమా. క్రమక్రమంగా మారుదువు గానిలే.

ప్రసాద్ : నాకు సంపూర్ణవ్యక్తి నౌదామనిలేదు. నేనెప్పటికీ కాను కూడాను. సంపూర్ణవ్యక్తిత్వం చాలా యిబ్బందికరం. స్త్రీలు మాలో ఉన్నలో టుల్నే ప్రేమిస్తారు. అవి మాలో ఎంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువగా క్షమిస్తారు.

యిందిర : మమ్మల్ని ప్రత్యేకంగా క్షమాపణకోరటం చాలా హీనత్వం. మాఆరాధనకు అర్హులైనవాళ్లు మమ్మల్ని వేరే క్షమాపణలు కోరడం ఎందుకు? అప్పుడు వాటిప్రసక్తేలేదు. మా నించి క్షమాపణలు కాదు మీరు కోరవలసింది; ఆరాధన.

[గిరిజా శంకర్ ప్రవేశం. శశికళ పక్కగా కూర్చుంటాడు]

లలిత : మేముస్త్రీలం ప్రతిదాన్నీక్షమిస్తాం కదూ కమలా, నీవు నాతో ఏకీభవిస్తావను కుంటున్నా.

కమల : ఏకీభవించ లేను. మనం ఎన్నటికీ క్షమించరానివి చాలా విషయాలున్నాయి.

లలిత : ఏం విషయాలు?

కమల : ఒక అమాయిక స్త్రీ జీవితాన్ని నాశనం చేయటం. (మెల్లగా స్టేజీ వెనుకకు పోతుంది.)

లలిత : అలాంటి విషయాలు చాలావిచారకరం. ఏమీసందేహం లేదు. చాలా పెద్దపెద్దయిళ్లలో కూడా అలాంటి విషయాలు జరిగేయికాని వాళ్లని సంస్క రించి ఎలాగో సద్దుకుపోయారు. విషయాలను తేలిగ్గా తీసికోవటం కంటే వేరే జీవిత రహస్యం లేదనుకుంటాను.

యిందిర : అసంభవ విషయాల్ని తలపోస్తూ ఉద్రేకానికి లోనుగాకుండా ఉండటమే జీవితరహస్యం.

శశికళ : దారుణమైన మోసాన్ని కిక్కురుమనకుండా భరించడమే జీవితరహస్యం.

చెంచయ్య : మనోవికారానికి లొంగకపోవడమే జీవితరహస్యం శశికళగారూ—— కాబట్టి....

ప్రసాద్ : అసలు జీవితానికి రహస్యమేమిటి ? అట్లాంటి దేదీలేనే లేదు. ఒకవేళ అట్లాంటి దేదైనా ఉంటే అది మనకున్న యీ అల్పకాలావధి లోనూ ప్రతి ఒక్క క్షణాన్నీ తీవ్రమైన మానసికోద్రేకంతో గడపగలగ డమే అయ్యుంటుంది. ఉద్రేకాలు మనం పిలిస్తే వచ్చే అంతదగ్గర్లోలేవు. ఒకొక్క రోజున ఒక్కరుకూడా దగ్గరలేకుండా గడుపుతుంటాను. ఆరోజు నాకు చాలా భయంకరంగా గడుస్తుంది. అనంతమైన నిరీక్షణ క్షణ క్షణానికి రక్తం స్రవించేలా గుండెల్ని పిండుతూంటుంది.

లలిత : అదేమిటో నాకు తెలియదు ప్రసాద్. కాని యివాళ మీవు మాట్లాడింది ప్రతీదీకూడా చాలా అవినీతిగా కనబడుతోంది. అయినా వినుట్కు వినటం అద్భుతమైన హాయిగా వుంటుంది.

ప్రసాద్ : ప్రతిభావనా అవినీతి కరమైందే. కాని భావనల్లోంచి తప్పించు కోవటం ఎవరితరమూకాదు. ఎంతటి అవినీతి నించికూడా ఏ భావనా వేరుకాలేదు.

లలిత : నాకు ఒక్కమాటగూడా అర్థంకాలేదు. కాని నిస్సందేహంగా అదంతా నిజమే. అయినా నామట్టుకు నేనుమాత్రం ఎప్పుడూ భావనా ప్రపం చంలో మునుగులాడటం జరగలేదు. అట్లాంటి దెప్పుడూ అలవాటు కూడాలేదు. స్త్రీలు ఎక్కువగా దేన్నిగురించీ భావవీదుల్లో విహరించరు. వాళ్ల ఏదిచేసినా ఒక్క పరిమితి ఉన్నట్టే దానికేపరిమితిని మించనీయరు.

ప్రసాద్ : పరిమితన్నది కేవలం ప్రాణాంతకమైన సంగతి. సఫలతను కాంక్షించేవాళ్లు పరిమితిని మించాలి.

లలిత : యీమాట నాకెప్పటికీ జ్ఞాపకం ఉంటుందను కుంటాను. యిది అద్భుతమైన సూత్రంలా ధ్వనిస్తూంది. కాని నాజ్ఞాపక శక్తి మెల్లగా నశించి పోతూఉంది. అదో పెద్ద దురదృష్టం.

ప్రసాద్ : అదే నీస్వభావంలో గొప్ప ఆకర్షణీయమైన గుణం లలితా! స్త్రీలకు జ్ఞాపకశక్తి ఉండటం అంత మంచిదికాదు. ఎన్నిమంచి లక్షణాలుగల స్త్రీకైనా జ్ఞాపకశక్తి అధికంగా ఉందంటే చాలా అసహ్యంగా తయారౌతుంది. జ్ఞాపకశక్తే వైధవ్యానికి పునాది వేస్తుంది. ఏస్త్రీ జ్ఞాపకశక్తినైనా ఆమెవేసికొన్న జాకెట్టుముచూసి చాలా తేలిగ్గా తెలిసికోవచ్చు.

లలిత : ఎంత తమాషాగా మాట్లాడుతున్నావ్, ప్రసాద్. నీవెప్పుడూ ఒక విశుద్ధమైన మంచిలో ఒక వికృతమైన చెడుగును స్పష్టంగా చూస్తూంటావు. జీవితాన్ని హాయిగా గడిపివేసే మార్గాలు నీకు ఎక్కువగా తెలుసు.

[అప్పన్న ప్రవేశం]

అప్పన్న : కారు తీసుకొచ్చాను. అమ్మగారు మిమ్మల్ని త్వరగాతీసుక రమ్మన్నారు గదండీ.

లలిత : అప్పుడే, యింకా పదిన్నరైనా కాలేదండీ డాక్టరుగారూ.

సదాశివం : (లేస్తూ) వెళతానండీ. పార్వతికి ప్రతి సోమవారం చాలా కంగారుగా ఉంటుంది. మర్చేపోయాను.

లలిత : (లేస్తూ) అయితే మిమ్మల్నియిక ఆపను. (అతనితో నడుస్తూ) రాముడుతో కొద్దిగా పులావ్ కారులో పెట్టమన్నాను. పార్వతికి పులావంటే యిష్టమేగదూ ?

సదాశివం : ఎందుకండీ అనవసరంగా; ఆమె యిప్పుడు మాంసాహారం మానేసింది. వట్టి శాకాహారంతోనే రెండు సంవత్సరాల్నించీ గడుపుతోంది. అప్పట్నించీ ఆమెచాలా ఆరోగ్యంగా ఉంటోంది. (లలితతో పోవును)

యిందిర : (కృష్ణప్రసాద్ వక్కగావెళ్ళి) యీవేళ వెన్నెలెంత బావుందో.

ప్రసాద్ : బయటికిపోయి కాస్సేపు చంద్రుణ్ని చూస్తూ వెన్నెట్లో తిరుగుదాం. అదేపనిగా కాకుండా అప్పుడప్పుడూ చూస్తూంటే ఏదైనా అద్భుతంగానే కనబడుతుంది,

యిందిర : నీకళ్లజోడు.

ప్రసాద్ : దానికి నామీద కోపం. అది నాకళ్లకింది ముడతల్ని మాత్రమే చూపుతుంది.

యిందిర : నాదిచాలా మంచిది. యిది ఎప్పుడూనాతో నిజంచెప్పదు.

ప్రసాద్ : అయితే అది నిన్ను చాలా ప్రేమించిందన్న మాట!

[రాధాకృష్ణ, శశికళ, చెంచయ్య, గిరిజాశంకర్ వెళ్ళిపోతారు]

మోహన్ : (ప్రసాద్‌తో) నేనుకూడా రావచ్చునా ?

ప్రసాద్ : హో, రా, మోహన్, రా, రా. (యిందిరతోనూ, మోహన్ తోనూ ద్వారంవేపు నడుస్తాడు. జానకివచ్చి త్వరత్వరగా చుట్టూచూసి, రాధాకృష్ణ, శశికళా వెళ్ళిన ద్వారానికి ఎదురుగాఉన్న ద్వారంగుండా పోతుంది.)

కమల : మోహన్ !

మోహన్ : ఏఁమ్మా! (కృష్ణప్రసాద్ యిందిరతో పోతాడు.)

కమల : చాలా ఆలస్యమై పోతూంది. యింటికి పోదాం. రా.

మోహన్ : ఏమిటేమ్మా. కాస్సేపుండకూడదూ. ప్రసాద్‌గారు చాలా కులాసాగా ఉన్నారు. చెప్పటం మర్చేపోయాను. యీనెలాఖరులోనే మేం అమెరికాకు బైలుదేరుతూన్నాం. నీకు చాలా ఆశ్చర్యంగా ఉండా ?

కమల : ముందు యింటికి వెళదాం. రా.

మోహన్ : నీవు నిజంగా రమ్మంటే ఉండు వచ్చేస్తాను. ప్రసాద్‌గారికి కాస్త గుడ్‌బై చెప్పేసి అయిదు నిమిషాల్లో వచ్చేస్తా. (పోవును)

[ప్రవేశం సుషిమా]

సుషిమా : ఎంతఅందమైన రాత్రి కమలగారూ!

కమల : అంత అందంగా ఉందా ?

సుషిమా : మిమ్మల్ని చూసినప్పట్నించీ ఎందుకో మీరంటే నాకు చాలా యిష్టంగా ఉంది. మీరు తక్కిన అందరికంటె భిన్నంగా కనబడుతున్నారు. మీరువస్తూ మీతో ఒక నిర్మల వాతావరణాన్ని తీసుకొచ్చారు. మిమ్మల్ని చూస్తూంటే మనస్సుకెంతో శాంతిగా ఉంది. నేనుచాలా కఠోరంగా మాట్లాడేశాను. కాని వాళ్లకు తగినట్టూ మాట్లాడేనను కుంటున్నాను.

కమల : నీవు చెప్పిందంతా నేను విన్నాను. నీఅభిప్రాయాన్ని నేను పూర్తిగా అంగీకరిస్తాను.

సుషిమా : మీరు విన్నారనుకోలేను. కాని నాకు తెలుసు మీరు నాతో వప్పుకుంటారని. పాపంజేసిన స్త్రీ శిక్షించ బడాలంటారా ?

కమల : తప్పకుండా.

సుషిమా : ఆమె మంచి మంచి యిళ్లల్లోకి, మంచి మంచి మనుష్యుల మధ్యకూ రావచ్చంటారా ?

కమల : రాకూడదు.

సుషిమా : ఆపాపంజేసిన పురుషుడు కూడా ఆదేవిధంగా శిక్షింపబడా లంటారా ?

కమల : ఆ, అదేవిధమైన శిక్షననుభవించాలి. పిల్లలుంటే మరివాళ్ల సంగతో, వాళ్లకిఅదే విధమైన శిక్షేనా ?

సుషిమా : ఆ, నిస్సందేహంగా. తల్లిదండ్రులు జేసినపాపాల్ని పిల్లలు తప్పకుండా అనుభవించితీరాలి. అది భగవంతుని నిర్ణయంకూడాను.

కమల : అది భయంకరమైన దైవనిర్ణయం. (కొద్దిగా పక్కకువెళ్లి ముఖం వెనుకకు తిప్పుకుని నిలబడుతుంది.)

సుషిమా : మీ అబ్బాయి మిమ్మల్ని విడిచి వెళ్లటమంటే మీకు చాలా యిబ్బందిగా ఉందను కుంటాను.

కమల : (సుషిమావేపు బాధగాచూస్తూ) అవును సుషిమా.

సుషిమా : కృష్ణప్రసాద్‌తో అతను వెళ్లటం మీకిష్టమేనా ? అంటే, డబ్బుకూ, హోదాకు ఏమీకొదవ లేదనుకోండి. కాని, డబ్బూ, హోదా, మనిషికి సర్వస్వం కాజాలవు కదా, ఏమంది కమలగారూ.

కమల : అవి కేవలం మనిషికి లోభత్వాన్ని పెంచుతాయి.

సుషిమా : అయితే మీఅబ్బాయిని ఆయనతో ఎందుకూ పంపటం ?

కమల : వాడేవెళతా నంటున్నాడు.

సుషిమా : అయినా మీరు వద్దంటే వెళ్లలేడనుకుంటా, వద్దన్నా వెళతాడా ?

కమల : వాడుపూర్తిగా మనసు దానిమీద లగ్నంచేసేశాడు.

సుషీమా : కాని మిమ్మల్ని తిరస్కరించి పోలేడు. మీరంటే అతని కెంతో భక్తీ ప్రేమాను. మీరు వెళ్లవద్దని చెప్పండి. తప్పకుండా ఆగిపోతా డాయన. ఆయన్ని మీరు పిలుస్తూన్నారనిచెప్పి యిప్పుడే మీదగ్గరికి పంపుతా నుండండి. కృష్ణప్రసాద్, ఆయనా డాబామీద ఉన్నారు. నేను సంగీతంగది లోంచి యిట్లావచ్చేప్పుడు వాళ్ళిద్దరి నవ్వులూ వినబడ్డాయి.

కమల : ఎందుకమ్మా నీకంత కష్టం ? మోహన్ వచ్చేవరకూ నేని క్కడే ఉంటాను. యింతలో పెద్ద మునిగి పోయేదేముంది ?

సుషీమా : కాదు నేను మీరు పిలుస్తున్నారని చెపుతాను. మీరుమాత్రం గట్టిగా వెళ్ళొద్దని చెప్పండి.

(వెళ్ళును)

కమల : వాడురాడు. నాకుతెలుసు వాడురాడు.

[జానకివచ్చి ఆత్రుతగా చుట్టూ చూస్తుంది మోహన్ కూడా వస్తాడు]

జానకి : కమలా, రాధ పైనెక్కడైనా ఉంటగా చూశావా ?

మోహన్ : లేదండీ. ఆయన పైనలేదు.

జానకి : ఏమిటీ చిత్రం? అతను పడుకునే వేళైపోయిందే! (పోతుంది)

మోహన్ : అమ్మా నిన్ను చాలాసేపు నించోబెట్టాను. మరిచిపోయా నీసంగతి. యివాళ రాత్రివాకు చాలాహాయిగా ఉందమ్మా. నాకింత సంతోషంగా ఎప్పుడూ లేదు ?

కమల : ప్రయాణోత్సాహమా ?

మోహన్ : ఎందుకే అట్లా మాట్లాడతావు. నిన్నువిడిచి వెళ్లటమంటే నాకెంత విచారంగా ఉందో; ప్రసాద్‌గారన్నట్లు ఆదిక్కుమాలిన తాలూకా ఆఫీసులో పనిచేయటం ఎంత కష్టమో నీకు తెలియదే అమ్మా నాకు ఎంతో ఉన్నతంగా బ్రతకాలనుంది. నీవు నన్నుచూసుకొని గర్వపడగలిగే టంత గొప్పగా బ్రతకాలనుంది. దానికి ప్రసాద్‌గారు చేయూతనివ్వ బోతూన్నారు. నేను ఉజ్జ్వలంగా జీవించటానికి ప్రసాద్‌గారు సర్వవిధాలా సహాయం చేస్తా నన్నారు.

కమల : మోహన్, నీవు ప్రసాద్‌గారితో వెళ్లవద్దు. నిన్ను ప్రార్థిస్తు న్నాను. మోహన్, నిన్ను బ్రతిమాలుతూన్నాను. ఆయనతో వెళ్లొద్దు నాయనా.

మోహన్ : అమ్మా, ఏమిటి యివాళ యిట్లా మాట్లాడుతూన్నావ్. క్షణ క్షణానికి నీమనస్సీవేళ యిట్లా చలించి పోతూందేం ? గంటన్నర క్రిందట డ్రాయింగు రూమ్‌లో అంతా వప్పుకున్నావు. యిప్పుడు యింతలోనే ఆటంక పెడుతూ నాఅదృష్టాన్ని కాలితో తన్నేయ మంటున్నావు. నాకు లభించిన యీవొక్క ఛాన్సు (Chance) కి కూడా నీళ్లువదలేయ మంటున్నావు. ప్రసాద్ గారిలాంటి అద్భుతమైన మనుషుల్ని ఎప్పుడంటే అప్పుడు కలుసుకుంటామను కోవటం చాలా తెలివితక్కువ. నాఅదృష్టం కలిసి వచ్చినప్పుడు నాతల్లే నాదారికి అడ్డుగా రావటం కేవలం నాదౌర్భాగ్యం. పైగా సుశీమాను నేను ప్రేమించా నన్నసంగతి నీకు తెలుసు. ఆమెకూడా నన్నెంతో ప్రేమిస్తూంది. నాకో అభివృద్ధికరమైన హోదాఉన్నట్లయితే ఆమెను వివాహమాడమని అడగ గలిగే వాణ్ని. యిదంతా నీకర్థమవటంలేదా యిప్పుడైనా; ప్రసాద్ గారికి అంతరంగిక కార్యదర్శిగా ఉండటమంటే ఏమను కుంటున్నావు ? .... నేనేగనక ప్రసాద్‌గారి సెక్రటరీ నయినట్లయితే సుశీమాను నన్ను వివాహం చేసికోమని అడగటానికేమాత్రం సందేహించను. ఆ దిక్కు మాలిన తాలూకా ఆఫీసులో గుమస్తాగా ఉంటూ ఆమెను అడగటం ఆమెకు తీరని అవమానం. పైగా పొగరు బోతు తనంగాకూడా కనబడుతుంది.

కమల : మోహన్, ఆమెనుగురించి నీవేమీ భయపడనక్కరలేదు. జీవితాన్ని గురించి ఆమె అభిప్రాయాలు నాకు తెలుసు, యిప్పుడే ఆమె నాతో చెప్పింది. (కొంతసేపు నిశ్శబ్దం)

మోహన్ : అయితే....ఉప్పుడంగా బ్రతకాలన్న నాకోర్కెని చంపుకో వలసిందేనా, ఏదో గొప్పగా....అందరికంటే అతి ఉన్నతంగా బ్రతుకుదామని కలలు కంటున్నాను. ఉన్నతంగా జీవించాలన్న నావాంఛని ఎప్పుడూ అణగ దొక్కటానికే ప్రయత్నిస్తూంటావు; ఈ ప్రపంచం వట్టి పాపిష్టి లోకమనీ, అభివృద్ధిని కాంక్షిస్తే ఆమాయకుల శవ పరంపరలపై నడవవలసి ఉంటుందనీ, నాకు నీవు ప్రతిరోజూ నూరిపోస్తూందే దానివి. అమ్మా, యిప్పుడు నాకామాటల్లో ఏమాత్రం నమ్మకంలేదు. ఈ లోకం చాలా ఆనందంగాను, అభివృద్ధి అద్భుత విషయంగాను, సంఘం యిందప్రధనస్సుగానూ కనబడుతూంది., నీవు నాకింత వరకూ బోధించిందంతా శుద్ధతప్పు. కృష్ణప్రసాద్ అద్భుతమైన మనిషి, మర్యాదస్తుడు. అట్లాంటి వాళ్లకే నిజంగా ప్రపంచంలో బతకటానికి అర్హతుంది. ఆయన మోస్తరుగానే ఉండటానికి నేను ఏదైనా చేసి తీరతాను.

కమల : అయితే నువ్వు బ్రతికుండగా మళ్ళీ కళ్ళచూడ నన్నమాట.

మోహన్ : అమ్మా, ఆయనతో వెళ్లడం నీకెందు కిష్టంలేదో చెపితే వింటాను. చెప్పు. నిజంగా చెప్పేయ్. ఏమిటది ?

కమల : అతను చాలా చెడ్డమనిషి.

మోహన్ : ఏవిషయంలో. నాకేం అర్ధమవటంలేదు. నీవుచెప్పేదేమిటో ?

కమల : చెబుతా.

మోహన్ : నీవు ఏవిషయాలను గొప్పగా నమ్ముతావో, ఆయన ఆవిషయాల్ని గురించే చాలా తేలిగ్గా హేళనగా మాట్లాడుతూంటాడనేనా ? బావుంది. మగవాళ్ల భావాలువేరు, ఆడవాళ్ల భావాలువేరు. వాళ్లకివేరువేరు ఆదర్శాలుండటం చాలా సహజం.

కమల : ఆయన ఆదర్శాలను గురించి కాదు. అసలు ఆయనకొక ఆదర్శమంటూలేదు, అందుకే ఆయన అంత చెడ్డమనిషిగా తయారయ్యాడు.

మోహన్ : అమ్మా. ఆయన్ని గురించి నీకేమైనా కొంత తెలుసాఏమిటి? నిజంగా తెలుసా ?

కమల : ఆ. ఒక విషయాన్ని గురించి కొంతతెల్సు.

మోహన్ : నిజంగానేనా ?

కమల : హ. నిజంగా.

మోహన్ : ఎంతకాలం క్రిందటిదా విషయం?

కమల : యిరవై సంవత్సరాల నాటి—

మోహన్ : అమ్మా. ఒక మనిషి జీవితంలోని యిరవై సంవత్సరాల వెనుకటి విషయాన్ని పట్టుకుని ఆమనిషియొక్క మంచిచెడ్డల్ని నిర్ణయించబూనుకోవటం చాలా అమానుషం.

కమల : యిరవై యేళ్లక్రిందట ఎట్లాఉన్నాడో, యిప్పుడూ ఆభావలతోనే ఉన్నాడు. యికముందుకూడా అట్లానే ఉంటాడు.

మోహన్ : ప్రిసాడ్‌గారేం జేశారో చెపితేగదా; ఆయనేదైనా సిగ్గుమాలిన పనిచేసి నట్టయితే, అమ్మా. నిజంగా నేనాయనతో వెళ్లటం మానేస్తాను.

కమల : మోహన్, యిట్లా దగ్గరగారా, యింకా దగ్గరికిరా (మోహన్ తల్లిపక్కకువెళ్లి కూర్చుంటాడు. ఆమె అతనితలను వేళ్లతో చిక్కుతీస్తూ, అరిచేతితో మెల్లగా నిమురుతూ) మోహన్, ఒకప్పుడు యీకృష్ణప్రసాద్ పదహారు సంవత్సరాల ఈడుగల ఒక అమ్మాయిని కలుసుకున్నాడు. అప్పుడా అమ్మాయికి జీవితమంటే ఏమిటో బొత్తిగా తెలియదు. కాని అతనికి అంతా తెలుసు. ఆ అమ్మాయి అతన్ని అమితంగా ప్రేమించినందువల్ల ఒకనాటి సాయంత్రంవేళ, ఆ అమ్మాయి తండ్రినీ, సమస్త బంధువుల్నీ, యింటినీ, సర్వస్వాన్నీ విడిచిపెట్టి యితనితో వెళ్ళిపోయింది. ఆమె యితన్ని ప్రాణంకంటే యెక్కువగా ప్రేమించింది. యితను ఆమెను వివాహం చేసుకుంటానని నమ్మించాడు. పాపం ఆ అమాయిక యితన్ని పూర్తిగా నమ్మింది. ఆలేతవయస్సులో ప్రేమకోసం ప్రతిదాన్నీ నిర్లక్ష్యం చేసింది. అయినా యితను వివాహానికి ఏవేవో సాకులుచెపుతూ వారాలు, నెలలూ దాటించేవాడు. అప్పటికీ ఆమెప్రేమ ఏమాత్రం చలించలేదు. అతన్ని ఎంతమాత్రమూ అనుమానించలేదు....కాని ఆమెకు కొడుకుపుట్టేముందు—ఆమెకొడుకు పుడితే—ఆపిల్లవాడు పుట్టేముందు ఆసంతానం భవిష్యత్తు కోసమైనా, తనను వివాహం చేసుకోమని అనేక విధాల అతి దీనంగా ప్రార్థించింది. తనదోషానికి ఫలితం నోచుకొని తన సంతానం అనుభవించ వలసొస్తుందని, పాషాణాలు ద్రవించేలా విలపించింది. కాని అతను వివాహానికి తీవ్రంగా నిరాకరించాడు. అప్పటికామె కళ్ల ముందు తెర దిగజారినట్లయింది. ఆమె సర్వనాశన మయింది. విష్ఠను ఘటం మీద వేసుకొని ప్రపంచానికి దూరంగా పోయింది. ఆమె అప్పటినించి యిప్పటి వరకూ దారుణ దుఃఖాన్ననుభవిస్తోంది. ఆమెలోని సున్నితత్వమూ సౌందర్యమూ నాశనమయ్యాయి. క్షణక్షణానికీ ఆమెదోషం ఆమెను వెన్నంటి వుంటున్నందువల్ల సుఖశాంతులకు దూరమై ఘోరమైన అశాంతితో కుములిపోతోంది. ఏ అగ్ని ఆమెను పవిత్రురాలిగా జేయలేవు. ఏసముద్రాలూ ఆమె పాపాల్ని కడిగి వేయలేవు. ఆమెహృదయాన్ని ఏవిషాలూ శాంతిపరచలేవు. ఏఆభరణాలూ ఆమెను భ్రమపెట్టలేవు. ఆమెకంతా శూన్యమై పోయింది. దీనికంతకూ యీ యీ కృష్ణప్రసాదే బాధ్యుడు. అట్లాంటి పాషండునికి నాకొడుకును వప్పగించలేను.

మోహన్ : అమ్మా, యిది చాలా దుఃఖకరమైన గాథలా ధ్వనిస్తున్న మాట నిజమే, కాని యీవిషయంలో ఒక్క కృష్ణప్రసాదొక్కడే నింద

నీయెడ జరగటం అన్యాయం! ......ఏమాత్రం మంచి బుద్ధిగల అమ్మాయైనా అట్లాంటి పనిచేయదు. తనతో వివాహంకాని మగవానితో యిల్లువిడిచి లేచిరావటానికి ఏసద్గుణవతీ అంగీకరించదు. (కొద్దిసేపు యిద్దరూ మౌనం)

కమల : మోహన్, నా ఆటంకాల్ని ఉపసంహరించుకున్నాను. యిక స్వేచ్ఛగా నీవు కృష్ణప్రసాద్‌తో నీయిష్టం వచ్చిన చోటుకి పోవచ్చును.

మోహన్ : నీవు నాదారి కెప్పుడూ అడ్డురావని నాకు తెలుసే అమ్మా! భగవంతుడు యీసృష్టిలో మంచిదానిగా నిన్నొక్కదాన్నే సృష్టించాడు. ఎలాంటి అప్రతిష్ఠ వచ్చేపనైనా కృష్ణప్రసాద్‌గారు చేస్తారంటే నేను నమ్మలేను.

సుషిమా : (లోపల) పోనీయ్, నన్ను పోనీయ్.

[సుషిమా భయోద్వేగాలతో దూసుకుంటూ వచ్చి మోహన్ వక్షానికంటుకు పోతుంది.]

సుషిమా : మోహన్, మోహన్, చూడు, చూడు, వాడు నన్ను.... ....

(వణికి పోతుంది)

మోహన్ : ఎవడు? ఏమిటి?

సుషిమా : వాడు—వాడు నన్ను అవమానించాడు, ఘోరంగా—

మోహన్ : ఎవడు? ఎవడు సాహసించాడు నిన్నవమానించటానికి?

[కృష్ణప్రసాద్ స్టేజికి కొద్దిగా పక్కకు వస్తాడు. సుషిమా మోహన్ చేతుల్లోంచి బయటికివచ్చి ప్రసాద్‌ని చూపుతుంది.]

మోహన్ : (అసహ్యంతోనూ, కోపంతోనూ కృష్ణప్రసాద్, దగ్గరగా వెళ్ళి) ప్రసాద్, యీ లోకాని కంతకూ పవిత్రమూర్తిని అవమానించావు. మాతల్లిలాంటి పావనమూర్తిని, యీసుషిమా కుమారిని, అవమానించావు. భగవంతుడున్నాడుపైన. నీలాంటి రుద్రాక్ష పిల్లుల్ని బ్రతకనీయ కూడదు. నిన్నిప్పుడే చంపేస్తా. (జేబులోంచి కత్తితీసి ప్రసాద్ మీదికి వెళ్లబోయేసరికి—)

కమల : (యిద్దరి మధ్యకూ దూసుకుని మోహన్‌చేయి పట్టుకుంటుంది) వద్దు, వద్దు. కాదు————అయన———

మోహన్ : (తల్లిని వెనుకకు నెట్టుతూ) నాచేయి వదిలేయి. నన్ను పట్టుకోవద్దు. వీణ్ని చంపేస్తాను.

కమల : మోహన్—

మోహన్ : ఉండు, వదులు, నాచేయివిడు.

కమల : ఆగు. మోహన్. ఆగు, కృష్ణప్రసాద్ నీతండ్రి. నిన్ను కన్న తండ్రి—

[మోహన్ తల్లి రెండు చేతులూ పట్టుకొని ఆమె కళ్లల్లోకి చూస్తాడు. ఆమె భారమైన సిగ్గుతో దిగజారి పోతుంది. సుషీమా పక్క ద్వారంగుండా పోతుంది. కృష్ణప్రసాద్ నోసలు విరుస్తూ, పెదాలు కరుచుకుంటూ ఉంటాడు. కొద్దిసేపైన తర్వాత మోహన్, తల్లిని మెల్లగా లేవదీసి పక్కగదిలోకి నడిపించుకుని వెళతాడు.]

తె ర.



# అంకం 4.

దృశ్యం : కమల యింట్లో చదువులగది. రెండు కిటికీలూ రెండు ద్వారాలూ ఎదురెదురుగా, రెండు తోట ల్లోకి, రెండు హాల్లోకీ ఉంటాయి. టేబిలు కెదురుగా కుర్చీలో కూర్చుని మోహన్‌కుమార్ రాసుకొంటూంటాడు. సీతమ్మ, లలిత, యిందిరా వస్తారు.

సీతమ్మ : అబ్బాయిగారూ! లలితగారూ, యిందిరగారూ వచ్చారు. (వెళ్ళి పోతుంది.)

లలిత : గుడ్‌మార్నింగ్ మోహన్.

మోహన్ : (చూసిలేస్తూ) గుడ్‌మార్నింగ్.

లలిత : (కూర్చుంటూ) మీతల్లి కెల్లావుందో చూసిపోదామని వచ్చాం. కులాసాగా ఉందా ?

మోహన్ : ఆమెలేచి యింకా క్రిందికి రాలేదండీ.

లలిత : ఆమెకు రాత్రిచాలా వేడిచేసిందను కుంటాను. రాత్రులు నిద్ర లేక పోవటమంత చెడుపు మరోటిలేదు. పైగా అసంగీతం: ఎదో వాళ్ళంగారాను శవాన్ని జ్ఞప్తికి తెస్తుంది. అదే నరాలమీదికి తెస్తుంది.

యిందిర : యీరోజుల్లో జరిగేదదే.

లలిత : ఏమిటే నువ్వనేది? నీవేదోచెడుగా ఊహిస్తున్నావను కుంటాను. హో, కమల గదిని పరీక్షిస్తున్నావేంటి ? యింత పురాతనపద్ధతి నీకు నచ్చదను కుంటాను.

యిందిర : (కళ్ళద్దాలుతీసి చుట్టూచూస్తూ) పక్కా తెనుగుయిల్లులావుంది.

కమల : అవును. అదే సరైన మాట; మోహన్, ప్రతి వస్తువు లోనూ మీ తల్లియొక్క సరళత్వం స్పష్టంగా కనబడుతోంది. పవిత్రతతో కూడిన ఆమె ప్రత్యేకత ప్రతి అంగుళంలోనూ కనబడుతోంది.

యిందిర : ప్రసాద్‌కి ప్రత్యేకతంటే చాలా అసహ్యం. అందులోనూ పవిత్రమైన ప్రత్యేకతంటే మరీను.

లలిత : ప్రసాదేగనక కమలను యింకా సరిగా తెలుసుకొంటే ఆతని మనస్సును వెంటనే మార్చుకుంటాడనటానికి సందేహం లేదు. అతన్నిక్కడి కోసారి తప్పకుండా తీసుకొస్తాను.

యిందిర : హాయినిచ్చే ఒక తెనుగు యింటిని ప్రసాద్ తప్పకుండా చూసితీరాలి.

లలిత : అవి అతనికి చాలా మంచి చేస్తాయి. యీ రోజుల్లో బాగా సంపన్న యిళ్లల్లో సినీమా పేపర్లు, యింగ్లీషు నావెల్సూ, పూవులు పూయని అడివి మొక్కలూ తప్ప మరోటి కనబడవు. యిప్పుడిప్పుడే వికసించిన పూవుల మధ్య యిక్కడ కూర్చుంటే ఋష్యాశ్రమంలో కూర్చున్నంత హాయిగా, శాంతంగా ఉంది. యిక్కడ మనల్ని కంగారుపెట్టి పైటల్ని సర్దుకొనేలాచేసే పుస్తకాలూ, సిగ్గుతో రెండు చేతులా కళ్లుమూసుకొనేటట్టు చేసేబొమ్మలూ కనిపించవు.

యిందిర : సిగ్గుపడేట్టుచేసే ఆబొమ్మలంటే నాకు చాలాయిష్టం.

లలిత : సందర్భాసందర్భాలను గమనించకుండా మాటిమాటికీ సిగ్గును ప్రకటించక పోయినట్లయితే, మనచుట్టూ ఉన్నవాళ్లు మనల్ని చాలా ఘోరంగా చెప్పుకుంటారు. మాఆయన ఎప్పుడూ, నాకు సిగ్గులేదని నిందిస్తూండేవాడు. అరవైఏళ్ల పైబడ్డ వాళ్లతోనేగాని నన్ను మాట్లాడనిచ్చేవాడు కాదు.

యిందిర : అరవైఏళ్ల పైబడ్డ మనుష్యులంటే నాకు చాలా ఆనందంగా ఉంటుంది. వాళ్ళెప్పుడూ జీవితాంతంవరకూ పూవుల్లోపెట్టి పూజిస్తామనీ చెపుతూ ఉంటారు. అరవైఏళ్ల మనిషికి చాలా అవసరమైన వయస్సు.

లలిత : యీమెచాలా అసాధ్యురాల్లాగుంది. (నవ్వుతూ) ఏదు మోహన్; అడగటం మర్చిపోయాను, మోహన్, నీవూ, ప్రసాదూ వెంటనే బయలుదేరుతున్నారా ? లేక యింకాకొద్ది రోజులు—

మోహన్ : నేను ప్రసాద్‌గారి సెక్రటరీగా ఉండదలచుకోలేదండీ.

లలిత : నిజమే, అహం, కాదు, లదిచాలా తెలివితక్కువ. ఏం, ఎందుకని ఉండదంటుకోలేదు ?

మోహన్ : ఆపనికి నేను తగను, అంతే.

యిందిర : ప్రసాద్ నన్ను ఉనశ్రకటరిగా ఉండమంటే బావుండును. కాని, నేను సీరియస్ (Serious)గా పనిచేయనంటాడు.

లలిత : యిందిరా, యీయింట్లో నువ్వావిధంగా మాట్లాడటం ఏమీ బావుండలేదు. పాపం. రమంటు మనమంతా జీవిస్తూన్న సంఘంలో గూడుకట్టుకున్న కల్లంపటాల సంగతి వీసమెత్తుకూడా తెలియదు. సంఘంతో ఆమెకెలాంటి పరిచయమూలేదు. అందువల్లే ఆమె అంత మంచిగా ఉండగలుగుతుంది. నిన్నటిరోజున అమె నాయింటికి రావటం నాకెంత గొప్ప. ఆమె రాకతో ఒక ఆహ్లాదకరమైన వాతావరణాన్ని తీసుకొచ్చింది.

యిందిర : అట్లాంటి వాతావరణం మేఘముక్తమైన చంద్రునివలన ఏర్పడి ఉంటుంది.

లలిత : అదేంటే యిందిరా, అలా మాట్లాడతావు? దానికీ దీనికీ ఏం సమ్మంధం ? మోహన్, నీవు దానికి తగవనటంలో నీ వుద్దేశమేమిటి ?

మోహన్ : జీవితాన్ని గురించి ఆయన సిద్ధాంతాలు వేరు. నా సిద్ధాంతాలు వేరు.

లలిత : మోహన్, యీ వయసులో అప్పుడే నీకో సిద్ధాంతాలంటూ ఏమిటి ? ఆ విషయంలో నీవు నీ కంటే పెద్దవారిని అనుసరించటమే తెలివైన పని. ప్రసాద్ నీకు చాలా గొప్ప ఆఫర్ (offer) చేశాడు. ప్రపంచమంతా ఆయనతో ప్రయాణిస్తూ అనేక గొప్పగొప్ప సమయాల్లో గొప్ప గొప్ప వారితో పరిచయంచేసుకొంటూ వాళ్ళందరితోనూ కలిసి నివసిస్తూ—జీవితాన్ని ఎంతఉన్నతంగా గడపవచ్చునో ఆలోచించు.

మోహన్ : నాకు ప్రపంచాన్ని చూడాలని లేదు. చూడవలసినంతా చూశాను. చాలు.

యిందిర : మోహన్, నీవు జీవితంలో అన్నీ అయిపోయినవాడు మాట్లాడినట్లు మాట్లాడుతున్నావు. అప్పుడే ఎందు కంత విరక్తి.

మోహన్: నాకు మా అమ్మను విడిచి వెళ్లటానికిష్టంలేదు.

లలిత : ష్, వట్టి సోమరితనం, మోహన్, అది వట్టి సోమరితనం. నేనే నీ తల్లినైతే నిన్ను బలవంతంగా నైనా పంపించి వుందును.

[సీతమ్మ ప్రవేశం]

సీతమ్మ : తలబాధ ఎక్కువగా ఉన్నందు వల్ల యివాల్టికి అమ్మగారెవర్నీ చూడలేనంటున్నారండి. (పోవును)

లలిత : (లేచి) ఓ! తలదాధతో మతిపోతుంది. మోహన్ ఆమెను సాయంత్రం కొంచెం కులాసాగా ఉంటే ఒక్కసారలా తీసుకురాగూడదూ?

మోహన్ : యివాల్టికి వీలుండదనుకుంటా నండి.

లలిత : పోనీ రేపైనా సరే, హా, మోహన్ నీకే గనక తండ్రి ఉన్నట్లయితే నీ జీవితాన్నిట్లా నిరుపయోగం కానీయబోను. వెంటనే ప్రసాద్ తో పంపి వేసుందును. కాని తల్లులు చాలా బలహీనులు. అయినా వాళ్ళ సర్వస్వాన్నీ కొడుకుల కిస్తారు. ఏంలాభం? మాకు హృదయమే గాని మెదడు లేదు. మాకున్నదంతా ఒక్క హృదయమే. వెళ్ళొస్తాం మోహన్.

(యిందిరా లలితా వెళ్ళిపోతారు)

(మోహన్ వ్రాసింది మడిచి కవర్లో పెట్టి అడ్రను రాసి అంటిస్తాడు. మళ్లా కుడివైపు నుంచి యిందిరా లలితా వస్తారు.)

లలిత : మోహన్, శ్యామసుందర్ గారింటికి యిట్లా మీ తోటలోంచైతే దగ్గరగా ఉంటుందని మళ్ళా వెనక్కొచ్చాం. వెళ్ళొస్తాం మోహన్. నీవు వెంటనే ప్రసాద్ తో వెళ్లమనే నా సలహా. నీజీవితం ఉజ్జ్వలంగా వెలిగి పోతుంది.

యిందిర : మోహన్, నీవుప్రపంచాన్ని చుట్టు తిరిగివచ్చేటప్పుడు ఏదో ఒక అద్భుతమైన వస్తువును నాకోసం తేవాలి సుమా మరిచి పోకుండా, అమెరికా ఆట బొమ్మను మాత్రం కాదు (యిద్దరూ ఎడమవేపుగా పోతారు)

[ప్రవేశం : కమల.]

మోహన్ : అమ్మా యిప్పుడే ఆయనకి రాశాను.

కమల : ఎవరికి ? ఏమని ?

మోహన్ : మానాన్నకి, మధ్యాహ్నం నాలుగు గంటలకి యిక్కడికి రమ్మంటూ రాశాను.

కమల : ఆయనిక్కడికి రాడు, ఆయన నాగుమ్మం తొక్కడు.

మోహన్ : తప్పకుండా వస్తాడు,

కమల : మోహన్, నీకాయనతో వెళ్లాలనుంటే తక్షణం వెళ్ళిపో, యెందుకు వెళ్లేముందు నన్ను చంపటం? ఆయన్ని కలుసుకోమని నాతోయిక యెప్పుడూ చెప్పకు.

మోహన్ : అమ్మా నన్నర్థంచేసుకోకుండా మాట్లాడుతున్నావు, నిన్ను విడిచిపెట్టి ఆయనతో వెళ్లటానికి యీలోకంలో నన్నే ఆకర్షణా పురిగొల్పలేదు. ఏమిటి రాశానంటే ఆయనకి—

కమల : ఏమిటిరాశావు ఆయనకి? ఏముంది రాయటానికి?

మోహన్ : అమ్మా, నేనేంరా శానో ఊహించలేవా?

కమల : ఉహూ.

మోహన్ : అమ్మా నువ్వూహించగలవు...కొద్దిరోజుల్లో అదిజరిగిపోవాలి.

కమల : ఏముంది జరగటానికి, ఏమిటది?

మోహన్ : అది జరగటానికి ఆయన్ని పూర్తిగా ఒత్తిడి చేస్తాను. అది అయిపోయి నట్లయితే, యీ చెడ్డంతా మంచిగా పరిణమిస్తుంది. ఎట్లాగో నీజీవితానికి తృప్తికలిగి తీరాలి. న్యాయం చాలా అలస్యంగా జరుగుతుంది, కాని చివరికి న్యాయమే జయించి తీరుతుంది, యిక కొద్దిరోజుల్లో నీవు కృష్ణ ప్రసాద్ భార్య వవుతావు.

కమల : కాని, మోహన్—

మోహన్ : ఎట్లాగైనా ఆయనని నిన్ను వివాహమాడేలా చేసితీరతాను, ఆయన తిరస్కరించటానికి సాహసించడు.

కమల : కాని, మోహన్, తిరస్కరించటం ఆయనకాదు, నేను,

మోహన్ : ఆయన్ని వివాహమాడవ్?

కమల : నేనాయన్ని వివాహమాడను.

మోహన్ : అమ్మా, నీవు విషయాన్ని సరిగా అర్థంచేసికోలేక పోతున్నావు. నిన్ను వివాహమాడమంటూంట నాకోసంకాదు, నీకోసం, అనేక కారణాలవల్ల యీవివాహం ముఖ్యంగా జరిగితీరాలి. కాని ఆయన ఆస్తిలోగాని, ఆయన కీర్తిలోగాని భాగస్వామి నౌదామని నాకెంతమాత్రంలేదు. యిదంతా

కేవలం నీకోసం........నాతల్లి నాతండ్రికి భార్యగాకుండా యిట్లాబ్రతకటం నేను సహించలేను.

కమల : ఏమైనా నేనాయన్ని పెళ్లిచేసుకోను.

మోహన్ : నీవు చేసికొని తీరాలి.

కమల : ఊహు, నావల్లకాదు, నీవేదో నామంచినిగురించి మాట్లాడుతున్నావు. యీ వివాహం నాకేంమంచిచేయగలదు ? నేను భరించవలసిన అవమానాన్నంతా భరించాను. పడవలసినంత ఆకలిబాధ పడ్డాను. కాని ఆయన మాత్రం సుఖంగానే ఉన్నారు. అంతే, యిదంతా స్త్రీకీ పురుషునికీమధ్య, యుగాలనించీ జరుగుతూన్న మామూలుచరిత్రే. ఎప్పుడూదీని అంతం చాలా సామాన్యంగానే ఉంటుంది. స్త్రీ బాధపడుతుంది, మగవాడు స్వేచ్ఛగా పోతాడు.

మోహన్ : సామాన్యంగా ఎట్లా అంతమౌతుందో నాకుతెలీదు. నీబ్రతుకు మాత్రం అట్లాకావటానికి వీల్లేదు. గతాన్ని యీవివాహం తుడిచివేయలేకపోయినా భవిష్యత్తుకు దానివల్ల చాలామంచి జరుగుతుంది.

కమల : ఆయనకు భార్యగాఉంటానికి నాకిష్టంలేదు.

మోహన్ : కాని ఆయనేగనకవచ్చి నిన్నడిగినట్లయితే నీసమాధానం మరోలాఉంటుంది. జ్ఞాపకముంచుకోఅమ్మా, ఆయననాతండ్రి.

కమల: ఆయనంతట ఆయనవచ్చి అడిగినా—ఆయనరానేరాడుగాని—వచ్చిఅడిగినా, నాసమాధానం ఒకేవిధంగా ఉంటుంది. నేను నీతల్లినన్నమాట మర్చిపోతున్నావ్ మోహన్ !

మోహన్ : అమ్మా ! ఇట్లామాట్లాడి నాకు చాలాబాధను కలిగిస్తున్నావు. యీవిషయాన్ని సరైనదృష్టితో ఎందుకాలోచించలేక పోతున్నావో నాకర్థం కావటంలేదు. నీజీవితంలోని విషాదాన్నించి, నిన్ను వెన్నాడుతున్న భయంకరమైన నీడల్నించీ తప్పించుకోవటానికి యీవివాహం అతిముఖ్యం. యీవివాహం కాగానే, నీవూ, నేనూ, అమ్మా ! నీయిష్టంవచ్చిన చోటుకుపోయి బ్రతుకుదాం. కాని ముందువివాహం జరిగితీరాలి. యిది కేవలం నీకోసం నీవు నిర్వర్తించవలసిన నీ బాధ్యత. దీనితో ప్రపంచంలోఉన్న స్త్రీలందరికీ మోసగించబడటమేమోనన్న భయం వదలిపోతుంది.

కమల : ప్రపంచంలోఉన్న స్త్రీలందరికీ ఉన్నభయాన్ని వదల్చవలసిన బాధ్యత నాకేమీలేదు. ఏస్త్రీకూడా నాకెట్లాంటి సహాయమూ చేసిఉండలేదు.

యీలోకంలో ఏస్త్రీనించికూడా నేను చివరికి ఒక్క సానుభూతిమాటకూడా యాచించలేదు. వాళ్లదయకోసం పాకులాడినట్టయితే నాబ్రతుకు మరీహీనంగా మారిపోను. ఒకస్త్రీ మరోస్త్రీకి పరమశత్రువు. నిన్నరాత్రి ఆ అమ్మాయి— ఆ అమ్మాయి ఎంతో మంచిదేకావచ్చు—నన్ను క్షయరోగిని చూసినట్టు చూసి పారిపోయింది; అవును. నేను అంటురోగినే. కాని నాపాపాలు నావే. నేనొక్కతెనే వాటిని భరిస్తాను. నేనొక్కతెనే వాటిని భరిస్తాను. కాని వాళ్లకు, ఆపవిత్ర స్త్రీలకు, నాపాపాలతో నాతో ఏంసమ్మంధం? వాళ్ళతో నాకేంసంబంధం? మేము ఒకర్నొకరం ఎన్నటికీ అర్థంచేసుకోము.

(సుషీమావచ్చి వెనక నిలబడుతుంది)

మోహన్ : నేచెప్పినట్టుచేయమని ప్రార్థిస్తున్నాను.

కమల : యిట్లాంటి దారుణ రహస్యత్యాగాన్ని ఏకొడుకూ ఏతల్లినీ అడగడు. ఎవ్వరూ అడగరు.

మోహన్ : తను కన్నకొడుకు తండ్రిని వివాహమాడటానికి ఏతల్లి నిరాకరించదు.

కమల : అయితేనేనే మొదటి దాన్ననుకో.

మోహన్ : అమ్మా, నీకు సనాతన ధర్మమంటే అమిత పట్టుదలగదా, అంత సనాతన ధర్మపరురాలవు నేను చెప్పేది. ధర్మవిరుద్ధమని ఎట్లా నిరాకరించగలవు? సనాతన ధర్మం ఒకటే మానవచరమ లక్ష్యానికి దారిచూపుతుందని నాకు ఉగ్గుపాలతో బోధించావు. నీవు మాత్రం నేడు ఆధర్మాన్నే తిరస్కరిస్తున్నావు.

కమల : నాకేమీ తెలీదు. ఆధర్మాలూ, ఆనీతులూ—కృష్ణప్రసాద్‌కి ధర్మపత్నిగా అగ్నియెదుట ప్రమాణంచేసి చెప్పలేను. ఆమాటల్ని యీనాడు నేను ఉచ్చరించలేను. నేను అసహ్యించుకొంటున్న మనిషిని యీనాడు హఠాత్తుగా ప్రేమించగలనని ప్రమాణంచేసి చెప్పటానికి సహించలేను. ఎవరైతే నిన్నూ నన్నూ తలెత్తలేని అవమానంతో కృంగజేశారో, వాడినినేను గౌరవించలేను. ఒకర్నొకరు అమితంగా ప్రేమించుకొని ఒకరులేకపోతే మరొకరు లేకుండా తోటా తోటా మోస్తావున్నా... వాళ్లంతరాని మాట: ఫిర్యాదు లేకుండా; ... అదికేవలం నీకోసం. ప్రపంచం నిన్నుజూసి చప్పట్లు గొట్టకుండాను, కాని నీగురించి ప్రపంచానికి ఇరవైసంవత్సరాలుగా అబద్ధం చెబుతూ వచ్చాను, యిప్పుడు ప్రపంచానికి నాముఖాన్ని పైకెత్తి నిజాన్ని చెప్పలేను. మోహన్, ఏవివాహమూ, ఏప్రమా

త్వమూ నన్ను కృష్ణప్రసాద్‌తో బంధించలేదు. ఆయనకూ నాకూఉన్న అను బంధం తొలగక పోవచ్చు. ఆయన నాసర్వస్వాన్నీ దోచుకున్నా నన్నుచివరికి భాగ్యవతిగానే విడిచిపెట్టేడు. బురదగుంటలాంటి నా జీవితంలో వెలలేని మాణి క్యాన్ని పొందగలిగేను. అదే నాజీవితానికి ఆనందజ్యోతి.

మోహన్ : ఏమిటీః నిన్నర్థంజేసికోవటం నాతరంకాదు.

కమల : తల్లుల్ని ఎప్పుడూ కొడుకులు అర్థం జేసికోరు నాయనా. నేనుచేసిన యీవొక్క పొరపాటునీ మినహాయిస్తే నేనూ అందరిలాంటి స్త్రీనే. అమాయకనై ఆపొరబాటు చేసినందు వల్లే దారుణమైన యీశిక్షను అనుభవిస్తూన్నాను. నిన్నుప్రసవించటానికి యించుమించుగా మరణదేవత వొడి లోకిపోయాను, నిన్ను పెంచటానికి మరణదేవతతో ముష్టియుద్ధంజేశాను, మరణ దేవత నిన్నుతీసుకోటానికి అనేకసార్లునాతో ఘోరంగాపోట్లాడింది.మరణదేవతకు పిల్లలులేరు. అందుకని ఆమె మాపిల్లల్ని తీసుకపోటానికి ప్రయత్నిస్తూంటుంది. కాని మేము పిల్లలచుట్టూ మాప్రాణాన్ని కోటగట్టి ఆమెతో ఘోరంగా యుద్ధం జేస్తాం. మోహన్ నీఆకలికి నాస్తన్యమిచ్చాను. నీవు దిగంబరిగాఉంటే నాచీర చెరుగుచించి కప్పేను. రాత్రింబగళ్లు వొడిలోవేసుకొని ఎట్లాంటి దుమారము నీకు సోకకుండా నిన్ను పెంచాను. మేము ప్రేమించిన వస్తువుకోసం మేము పడ రాని హీనత్వమూ, దిగరాని అగాధమూ అంటూలేవు. హో, మోహన్. నీవు నాప్రాణానివి. నీకూ ప్రేమకావాలి. ప్రేమఒక్కటే మనుష్యులను ప్రాణాలతో ఉంచుతుంది. కాని పిల్లలుమాత్రం దాన్నే మీ లెక్కజేయకుండా మాకు దుఃఖం కలుగజేస్తూంటారు. వాళ్లు పెద్దవాళ్లైన తరువాతనయినా మాప్రేమనుగుర్తించి మమ్మల్ని అమితాదరణతో చూస్తారనుకుంటాము. కాని అట్లాజరగదు. ప్రపం చంలో, లోకం మానుంచి వాళ్లను వేరుజేసేస్తుంది. వాళ్లెవళ్లతో సుఖంగా ఉంటుందో వాళ్లతో స్నేహంజేస్తూ మమ్మల్నిమరచిపోవటానికేమాత్రమూ సంశే హించరు. జీవితంలో వాళ్లకి ఏపాటి లోటుకనుపించినా తిరిగిమమ్మల్నే నింది స్తారు. వాళ్ల సుఖజీవితంలోమాత్రం మాకేమీ భాగంఉండదు. నీవు నీస్నేహి తుల యిళ్లల్లో హాయిగా ఆనందంగా గడుపుతూఉంటావు. నేనుమాత్రం నాభయం కరమైన అపవాదుల్తో గదితలుపులు మూసికొని అంధకారంమధ్య కూర్చుని విల పిస్తూంటాను. నా గతం నన్ను వెంటాడుతూండగా ఏగౌరవమైన యిళ్లకీ వెళ్ల టానికి సాహసించలేను. నీవుమాత్రం నాకు ఆనందకరవిషయాలంటే ఏవగింపను కుంటావు. కాని మోహన్, వాటికోసం నేనెంత తపించిపోతున్నానో నీకెలా

తెలుస్తుంది? అయినా సౌఖ్యంకోసం చేయిచాపటానికి సాహసించలేక పోతు న్నాను. నాకిక జీవితంలో సుఖపడటానికి హక్కులేదనిపిస్తుంది. కాని నీవు నేను యీబీదతనంలోనే సుఖపడుతున్నా ననుకుంటున్నావు. నా కింకేదీ గత్యం తరంలేక యిట్లా గడుపుతున్నాను. ఘోరమైన దావానలంతో దహించుకు పోతూందే హృదయానికి చిన్నచిన్న నిప్పుకణాలేమిలెక్క? జీవితంలో ఏవి ధంగా నాకు శాంతిలభిస్తుంది? రోగితనకు దిండుసవరించే చేతియొక్క శుభ్రా శుభ్రాల్ని గమనించనట్టే మానవులు మరణసమయంలో తమ కనురెప్పలమీద, పెదవుల్లోని పవిత్రతనుగూర్చి శంకించలేరు.నీవు పుట్టినప్పటించీ నాబ్రతుకంతా నీవేఐపోయావు! నీకు వెగటయ్యేటంత యిదిగా నాప్రాణమంతటితోనూ నిన్ను ప్రేమించాను. నాహృదయం ఎల్లప్పుడూ నిన్నుగురించే తపించి పోతూంటుంది. కాని నీవుమాత్రం నేను నాబ్రతుకంతా ఎక్కువగా దేవాలయంలోనే గడపటం నిన్ను మరచిపోవటానికే ననుకుంటున్నావు. అవునా? పాపాత్ములకుయీలోకంలో దేవునిగుడిద్వారం ఒక్కటే తెరిచిఉంటుంది. తక్కిన లోకమంతా వీళ్లనిచూసి తలుపులు మూసుకుంటుంది. నా ప్రేమ నీరూపంగా ఫలించినందు వల్లనేజేసిన పొరబాటు కేనాడూ పశ్చాత్తాపపడలేదు.మోహన్, నేను పశ్చాత్తాప పడవలసిన అవసరంలేదు. చివరకి నీవుఎంత కూ్రరంగా ప్రవర్తించినా పశ్చాత్తాపపడను. కేవలం మనసంబంధం తల్లీకొడుకుల సంబంధమేకాదు మోహన్! మనసంబంధం దానికంటేకూడా చాలా—చాలాగొప్పది. పవిత్రతకుకూడా అతీతమైంది. మన సంబంధం, మోహన్....నీకు అర్థంకావటంలేదూ? నాకళంకమే నిన్ను నాకింత దగ్గరగా నెట్టింది. నీకోసం అదే నేచెల్లించినమూల్యం. నీకోసం, హృదయాన్నీ శరీరాన్నీఅర్పించేశాను, మోహన్. యికఆవిషయం నన్నుకోరి బాధించకు. నీవు నాసిగ్గును బలిగొనిపుట్టినచిన్ని పాపవు. మోహన్, నీవుశాశ్వతంగా అట్లానేఉండి పోవటం మంచిది.

మోహన్: అమ్మానేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నీకుతెలీదు. ప్రాణం ఉండగా యికనిన్ను నేనెన్నటికీ విడిచిపెట్టిపోను. కాని అమ్మానీవు నాతండ్రికి భార్యకావటానికి అంగీకరించాలి, నీవాయన్ని వివాహం చేసుకుని తీరాలి. అది నీవిధి.

సుషిమా: (పరిగెత్తి కమలను కౌగలించుకుని) వద్దు. వద్దు మీరాయన్ని ఎన్నటికీ వివాహం జేసికోవద్దు. అదిమీకు చాలా తలవంపు. మీరీయన్నికూడా విడిచిపెట్టి, నాతోరండి, ప్రపంచంచాలా విశాలమైంది.

కమల : నాకుగాదు, సుషిమా, నాకేప్రపంచమూ లేదు. నేనడుగుబెట్టిన భూమికంటక మయమైపోతుంది. సుషిమా, నేను నిట్టూర్చిన గాలి విషక్రిమి మిశ్రితమై పోతుంది.

సుషిమా : కాదు, మనం. మనమిద్దరం నిర్మల నదీతీరానికి పోదాం. అక్కడ ఒకరికొకరం ఎదురెదురుగా కూర్చుని గొంతుతౌలదీ ఏడుద్దాం. మని ద్దరికీ మోహన్‌ని అమితంగా ప్రేమించిన మనిద్దరికీ— ఆమార్గమొక్కటే కన వడుతూంది.

మోహన్ : సుషిమా !

సుషిమా : కాదు, కాదు, నీవు నీతల్లిని ప్రేమించనంతకాలమూ నన్ను కూడా ప్రేమించలేవు. ఆమెను పూజించకుండా నీవునన్ను గౌరవించలేవు. ఆమె స్త్రీత్వమంతా చితికిపోయింది. అమెతోబాటు లోకంలోని స్త్రీత్వమంతా శిథిలమై పోయింది.

మోహన్ : సుషిమా ! ఏంచెయ్యను నేను ?

సుషిమా : నీవు నీతండ్రిని గౌరవిస్తావా ?

మోహన్ : ఆయన్ని గౌరవించటమా? ఆయనచాలా అవినీతిపరుడు.

సుషిమా : పోయినరాత్రి ఆయన్నించి తప్పించినందుకు ఎంతో కృతజ్ఞ రాలని.

మోహన్ : అదేముంది, నీకోసం ప్రాణాల్ని కూడా లెక్కచేయను. కాని యిప్పుడు నేనేంచేయాలో చెప్పావుకాదు.

సుషిమా : నన్నుకాదు. నీ హృదయాన్నడుగు. మంచి చేయటానికైనా చెడ్డజేయటానికైనా నా తల్లి నా చిన్నతనంలోనే చనిపోయింది.

కమల : సుషిమా, వీని హృదయం పాషాణం. నన్ను పోనీయ్.

మోహన్ : (త్వరగా తల్లిపాదాల్ని స్పృశించి) అమ్మా నన్ను క్షమించు.

కమల : నా పాదాల్ని తాకకు. నా హృదయం మండుతూన్నదే అవీ మండిపోతున్నాయి, అది ఏనాటినుంచో రగులుకుపోతూంది.

సుషిమా : హృదయాలు మండుతూన్నంత కాలమే ప్రాణాలతో ఉజ్జ్వ లంగా ప్రకాశించ గలుగుతాము. సుఖపరంపరలు హృదయాన్ని నల్లరాతిగా జేసేస్తాయి.

మోహన్ : అమ్మా! నాకు తల్లివీ తండ్రివీ రెండూ నీవే. నాకు తండ్రి అవసరంలేదు. కాని నీకోసమే నేనింతగా చెప్పింది. అమ్మా ఒకరిప్రేమను పొందటానికి మరొకరిని పోగొట్టుకోవాలా? అమ్మా ఎంతకఠినురాలివే నీవు. (దుఃఖిస్తూ పైకిలేచి సోఫాలో కూలబడతాడు.)

కమల : (సుషిమాతో) యితను యింకొకరి ప్రేమకోసం కొట్టుకు పోతున్నాడు.

సుషిమా : యితన్ని నేను అమితంగా ప్రేమిస్తున్నానని మీకు తెలుసుగదా?

కమల : కాని మేము చాలా బీదవాళ్లం.

సుషిమా : ప్రేమించబడ్డవాళ్ల బీదవాళ్ళా? కాదు కాదు. ఐశ్వర్యమంటే నాకు చాలా అసహ్యం. అదిపెద్దభారం. నాకున్నదాల్లో అతనికీ భాగంవుంటుంది.

కమల : సుషిమా, మేం వెలిలోఉన్నాం. మోహన్‌తండ్రెవరో ప్రపంచానికి తెలీదు. తల్లిదండ్రులు జేసినపాపానికి ఫలితం పిల్లలకు చుట్టుకోవటం భగవన్నిర్ణయం గదమ్మా

సుషిమా : నేనుచాలా పొరబడ్డాను, ప్రేమ అన్నిటినీ జయిస్తుంది.

కమల : (లేచి సుషిమా రెండుచేతులనూ తీసికొని మోహన్ దగ్గరికి వెళ్లి మెల్లగా అతన్ని తాకుతుంది. అంతవరకూ రెండుచేతుల్తోనూ మొఖంకప్పుకుని విలపిస్తున్న మోహన్ నెమ్మదిగా తలపైకెత్తి చూస్తాడు.) మోహన్, నీకు తండ్రినివ్వలేనుగాని అర్ధాంగి నివ్వగలను.

మోహన్ : అమ్మా. మీయిద్దరితో ఎవర్నిగ్రహించటానికీ నాకు అర్హత లేదు.

కమల : అందుకే, ఆమెను గ్రహించటానికి నీకు అర్హతుంది. మోహన్ నీవామెతో వెళ్ళిపోయినప్పుడు నన్నెప్పుడైనా జ్ఞప్తికిదెచ్చుకుంటూంటావా నాయనా? మీరెప్పుడూ హాయిగాబ్రతకాలని నిత్యమూ భగవంతుణ్ని ప్రార్థిస్తూ ఉంటాను.

సుషిమా : మీరు మమ్మల్ని విడిచిపెట్టి ఉండటానికి వీల్లేదు.

మోహన్ : నీవు మమ్మల్ని విడువటానికి వీల్లేదే అమ్మా!

కమల : నేను మీదగ్గరుంటే మీక్కూడా తలవంపు లొస్తాయి.

మోహన్ : అమ్మా!

కమల : కొద్దికాలం నన్నిట్లా మీకు దూరంగా ఉండనిస్తే కొంతకాలం గడిచాక అప్పుడు మీదగ్గరికివచ్చి శాశ్వతంగా అక్కడే ఉండిపోతాను.

సుషీమా : రండి కొద్దిగా అలాతోటలో తిరుగుదాం.

కమల : నేతరువాత వస్తాను మీరు వెళ్లండి

(సుషీమా, మోహన్ వెళ్లిపోతారు)

[సీతమ్మ ప్రవేశం.]

సీతమ్మ : ఎవరో పెద్దమనిషి మిమ్మల్ని చూట్టానికట వచ్చారమ్మా. (కార్డు యిస్తుంది.)

కమల : నేనింటిదగ్గర లేననిచెప్పు. (కార్డుచూస్తూ) ఈయన్ని చూడనని చెప్పు. వెళ్లు.

[కృష్ణప్రసాద్ ప్రవేశం.] (సీతమ్మపోతుంది.)

కమల : ఏం మాట్టాట్టానికి వచ్చారేమిటి, ఎందుకు మీరీ యింటికిరావటం?

ప్రసాద్ : నిర్మలా, మోహన్‌కి యిప్పుడంతా తెలిసి పోయిందను కుంటాను. యికమనలో మనం ఏదోవిధంగా సమాధానంపడటం బావుంటుంది. మోహన్‌కి నేనంటే ఎంతో ప్రేమ కుదిరింది.

కమల : మోహన్ యిక్కడికి ఏక్షణాన్నయినా రాగలడు. గతరాత్రి ఎట్లాగో నిన్నురక్షించాను. యికనిన్ను రక్షించటం నాతరంకాక పోవచ్చు. మోహన్ మీరంటే ఎంతోకోపంగా వున్నాడు. మీరు వెంటనే యిక్కణ్నించి వెళ్ళిపోపటం మంచిది. మిమ్మల్ని వేడుకుంటాను వెళ్లండి.

ప్రసాద్: (కూర్చుంటూ) గతరాత్రింతా పీడకలలా కనబడుతోంది. ఆ వెకిలిపిల్ల పెద్దగోల చేసేసింది. ఊరికే, ఆమెచేతిని ముద్దుపెట్టుకుందామని చేయి పట్టుకునేసరికి నానాహంగామా చేసింది. దాల్లో పెద్ద ప్రమాదం ఏముందో నాకర్థం కావటంలేదు.

కమల : జీవితాన్ని సర్వనాశనం జేయటానికి ఒక్కముద్దుచాలు ప్రసాద్ గారూ ! అదినాకు స్పష్టంగా తెలుసు.

ప్రసాద్ : ప్రస్తుతం దాన్నిగురించి వాదించబూనుకోటం అనవసరం. మోహన్ అన్నివిధాలా నాకు నచ్చాడు. ఒక్క పవిత్రవాదుల తరుఫున

మాట్లాడటంతప్ప. పోయినరాత్రి అనంగనాచికోసం కత్తిదీసి నామీదికివచ్చిన దూకుడ్ని తలచుకుంటూంటే నాకుమరీ గర్వంగాఉంది. మోహన్ నాఆశయాలకి తగ్గకొడుకు. యీదిక్కుమాలిన పరిజారాజ్యంలో ఒక్క జమీందారీ బిరుదుతప్ప నాకున్న సర్వస్వాన్ని వానికిప్పుడే యిచ్చివేయటానికి నాకేలాంటి అభ్యంతరమూలేదు. ఈవిషయాన్ని చెప్పటానికే నేనిక్కడికి వచ్చింది.

కమల : నన్నామాటలేవీ ఆకర్షించలేవు. మీరు వెళ్లండిముందు.

ప్రసాద్ : అయితేమోహన్ ఆరునెలలు నీదగ్గిరా ఆరునెలలు నాదగ్గరా ఉంటాడు. ఏం ? దానికైనా వొప్పుకుంటావా ? నీవు నీయిష్టం వచ్చినచోట ఎక్కడున్నా నీకు కావలసినంత సొమ్ము పంపుతాను. నీగతం మోహన్‌కీ నాకూతప్ప యింకెవ్వరికీ తెలియదు. ఆ వెకిలిపిల్లకుకూడ తెలుసుననుకుంటాను. తెలీనీయ్ మనకేంలెక్క. నిన్నటిదంతా ఆమె అందరికీ పెద్దపెద్ద కథలుగా అల్లి చెబుతూందనుకుంటాను. స్త్రీలంతా ఆమెను ఒకఖుంఠనుకుంటారు. మగవాళ్లంతా ఆమెను పెద్ద Bore అనుకుంటారు. మోహన్ నాఆస్తికి వారసుడు కావటానికి హక్కుందదేమోనని నీవు అనుమానించ నవసరంలేదు, వివాహానికి నాకేలాంటి అభ్యంతరమూలేదు. యిదికూడా నేనిప్పుడే చెబుతున్నాను.

కమల : (కళ్లనీరుతో) మీరుచాలా ఆలశ్యంగా వచ్చారు. నాకొడుక్కు యిప్పుడట్లాంటి అవసరమేమీలేదు. మీరుకూడా యిప్పుడతని కనవసరం.

ప్రసాద్ : ఏమిటి నిర్మలా నీవనేది ?

కమల : అతని భవిష్యత్తుకు మీరిప్పుడు అనవసరం.

ప్రసాద్ : నాకర్థం కావటంలేదు.

కమల : అలాతోటలోకి వోసారి చూడండి (కృష్ణప్రసాద్‌లేచి కిటికీలోంచి చూస్తాడు) మీరుమాత్రం వాళ్లకు కనబడకండి. మిమ్మల్నిచూస్తే వాళ్లకేం బావుండదు. ఆమె అతన్ని గొప్పగా ప్రేమిస్తూంది. ఒకరొన్నొకరు ప్రేమించుకున్నారు. యికనీవించి ఎలాంటి యిబ్బందులూలేకుండా మేమంతా వెళ్ళిపోతూన్నాం.

ప్రసాద్ : ఎక్కడికి పోతూన్నారు ?

కమల : అదినీతో చెప్పను. ఎవరి జీవితాల్ని నీవుసర్వవిధాలా నాశనం చేయదలచు కున్నావో వారిఉనికి తెలియటం నీకు అనవసరం.

ప్రసాద్ : నీహృదయం కఠిన పాషాణమైపోయింది నిర్మలా!

కమల : ఒకప్పుడు నాహృదయం మృదులంగానే ఉండేది.

ప్రసాద్ : ఆరోజుల్లో నాదిచాలా చిన్నవయస్సు. మాకు మగవాళ్ళకి, జీవితమంటే ఏమిటో చాలా చిన్నప్పట్నించీ అర్థమౌతుంది.

కమల : మాకు, స్త్రీలకు జీవితమంటే ఏమిటో చాలా ఆలస్యంగా తెలుస్తుంది. అదే మీకూమాకూ ఉన్న తేడా.

ప్రసాద్ : నిర్మలా, నాడబ్బుతో వానికి వవిలేకపోయినా నాకొడుకు నాదగ్గఱ ఉండటంకోరుతున్నాను. నిర్మలా నీవు తలచుకుంటే మమ్మల్నొకరికొకరం దగ్గరమేలాచేయగలవు. (టేబిలుమీద ఉత్తరాన్ని చూస్తాడు.)

కమల : అతని జీవితంలో మీకిక స్థానంలేదు. మీరంటే యిప్పుడతనికేవిధమైన శ్రద్ధాలేదు.

ప్రసాద్ : అయితే నాకెందుకు రాశాడు?

కమల : ఏమిటీ, మీరనేది?

ప్రసాద్ : ఈ కవరేమిటి?

కమల : అదేమీలేదు. దాన్నిలాయివ్వండి.

ప్రసాద్ : దీనిమీద నాఅడ్రసుంది.

కమల : మీరుదాన్ని చూడగూడదు. యిలాయివ్వండి.

ప్రసాద్ : యిది మోహన్ దస్తూరీ.

కమల : అదిమీకు పంపటానికి కాదు. యివాళఉదయం మోహన్‌నన్ను చూడకుండా రాసిన ఉత్తరంఅది. నన్నుచూసిన తర్వాతదీన్ని రాసినందుకు చాలా నొచ్చుకున్నాడు. మీరుదాన్ని తెరవకండి. యిలాయిచ్చి వేయ్యండి.

ప్రసాద్ : యిదినాకు సంబంధించిన సంగతి. (కవరుతెరచి మెల్లగా చదువుతాడు. కమల అంతసేపూ అతనిముఖాన్ని పరికిస్తూ ఉంటుంది.) నీవీ వుత్తరం చదివేవుంటావను కుంటాను, ఏం నిర్మలా?

నిర్మల : లేదు.

ప్రసాద్ : దీన్లోని విషయం నీకుతెలుసు.

కమల : అవును తెలుసు.

ప్రిసాద్ : వాడు చెప్పినట్టూ వివాహం జేసికోవటం నావిధం టే, నేనెంత మాత్రం ఒప్పుకోను. కానివాడు నాదగ్గరుంటానికని వప్పుకుంటాను. నిన్ను వివాహ మాడటానికినేను రెడీగాఉన్నాను. నీవు యిష్టపడిన వెంటనే నిన్ను వివాహంజేసి కొని నాజీవితాంతంవరకూ నిన్ను ప్రిత్యేక గౌరవంతో చూస్తాను.

కమల : అనాడుకూడా యిట్లానే వాగ్దానం జేశావు.

ప్రిసాద్ : యిప్పుడు నావాగ్దానాన్నేవిధంగానూ భంగపరచను. మోహన్ని నీవెంతగా ప్రేమిస్తూన్నావో నేనూ అంతకంటె ఎక్కువగా ప్రేమిస్తూన్నాను. నిర్మలా నాకూ పెద్దపెద్ద ఆశలున్నాయి. నారక్తాన్ని పంచుకుని పుట్టిన వానికోస మైనా యిప్పుడు నావాగ్దానాన్ని నిలుపుకుంటాను.

కమల : మిమ్మల్ని వివాహమాడటం నాకెంతమాత్రం యిష్టంలేదు. యిప్పుడు.

ప్రిసాద్ : నీవు నిశ్చయంగా చెబుతున్నావా ?

కమల : ఆ.

ప్రిసాద్ : కారణమేమిటో నేనుతెలుసుకోవచ్చా ?

కమల : అదంతా మోహన్‌తో చెప్పేను.

ప్రిసాద్ : అవేవో పిచ్చిహా జనితాలై ఉంటాయి. అవునా? స్త్రీలెప్పుడూ భావనాప్రపంచంలో ఊగులాడుతూ కేవలం ఊహలకోసం బ్రితకు ఈడుస్తూంటారు. జీవితాన్ని మీరునరైన దృష్టితో చూడలేరు.

కమల : అవును. మీరన్నది చాలానిజం. కానిమాకు రెండురకాల మనోభావాలుంటాయి. అతనంటేప్రేమ, మీరంటే అసహ్యమూ, రెంటిలో ఏఒక్కదాన్నీ మీరుచంపలేరు. అవిఒకదాన్నొకటి పోషించుకుంటుంటాయి.

ప్రిసాద్ : నాపైఅసహ్యాన్ని పోషించుకోటానికి ఏట్లాంటి ప్రేమ ఆవసరం నిర్మలా.

కమల : నాకు మోహన్‌పైనున్న ప్రేమలాంటి మాతృప్రేమ. అది చాలా భయంకర మంటారా మీరు? అవును ప్రేమంటేనే భయంకరమైంది. [illegible] ఒకప్పుడు మిమ్మల్ని సాహ్రితంకంటే ఎక్కువగా ప్రేమించాను. హా! మిమ్మల్ని [illegible] మీరెంత దుఃఖాన్ని కలిగించగలరో [illegible]

ప్రసాద్ : అందుకని నాతో వివాహానికి తిరస్కరిస్తూన్నావా ?

కమల : అవును.

ప్రసాద్ : నీవునన్ను అసహ్యించు కుంటున్నావా ?

కమల : అవును

ప్రసాద్ : నీలాగే నాకొడుకుగూడా నన్నసహ్యించు కుంటున్నాడా ?

కమల : లేదు

ప్రసాద్ : అందుకునాకు చాలా సంతోషంగాఉంది నిర్మలా.

కమల : మీమీద వానికికేవలం తృణీకార భావం.

ప్రసాద్ : నన్నుగురించి ఎంతవిషం తలకెక్కించారో, ఎంత అపార్థం జేసికున్నాడూ ? చివరికి—

కమల : మిమ్మల్ని మీరే మోసగించుకోకండి ప్రసాద్; పిల్లలు పసితనంలోనైతే వాళ్ళ తలిదండ్రులెట్లాంటి వాళ్ళైనప్పటికీ ప్రేమించ గలుగుతారు. వాళ్ల పెద్దవాళ్ళై మంచిచెడ్డల్ని విచారించగలిగిన వయసొచ్చాక వాళ్ల ప్రేమించడం మాటటుంచి చివరికి క్షమించటమే కష్టమైపోతుంది.

ప్రసాద్ : (మళ్ళా. ఉత్తరాన్ని నెమ్మదిగా చదువుతూ) నీకొడుకు యొక్క తండ్రినిగురించి, యిట్లాంటిఅందమైన వుత్తరంరాసిన ఆపసిహృదయానికి ఎట్లాంటి విషం నూరిపోసేవో కొంచెంచెపుతావా ?

కమల : వానికి మిమ్మల్నిగురించి నేనేమీవిషంనూరి పోయలేదు. ఆపని చేసినవారు వేరేఉన్నారు.

ప్రసాద్ : ఏశూర్పణఖ ?

కమల : సుషిమా

ప్రసాద్ : (బాధగా కనుబొమలు దగ్గరికిలాగుతూ నెమ్మదిగా టేబిలు దగ్గరికివెళ్లి Case లోంచి సిగరెట్టుతీసి అంటించి కేసుటేబిలుమీద ఉంచుతాడు.) అయితేయిక నేనువెళ్లవచ్చా నిర్మలా ?

కమల : ఆ.

ప్రసాద్ : యిదే కడసారా ?

కమల : నేను కోరేదీ ఆదే.

ప్రసాద్ : నిర్మలా ఇవ్వాళనిన్నుచూస్తూ నీమాటలు వింటుంటే 20 యేళ్ల క్రిందట నన్నువిడిచిపెట్టి పోయేనాటి నీవుజ్ఞాపకం వస్తున్నావు. నీపెదవులు అవేమాటల్ని ఉచ్చరిస్తున్నాయి. నీకళ్లల్లోఅదేకాంతి మెరుస్తూంది.... నిర్మలా, నీఅంత

గాఢంగా నన్నే స్త్రీకూడా ప్రేమించలేదు. సౌరభాలువెదజల్లేవు కుమారకుసుమాన్ని నాచేతికందించి, నాయిష్టంవచ్చినట్లూ ఆడుకోమన్నావు. తలుచుకొన్నకొలదీ తపింపజేసే నీశృంగారచేష్టల్ని, అద్భుత సంగీతాన్ని వినిపించే నీఅతిలోక లావణ్యాన్నీ నే నీజన్మలో మరిచిపోను ........ (రిష్టువాచీ చూచుకొని) హో, అప్పుడే పావుతక్కువ నాలుగైంది. లలితనుచూట్టానికి వెళ్ళాలి. అక్కడ నిన్నుమళ్ళా చూడలేనా ? నాకు నిజంగాఎంతో విచారంగాఉంది, ఒకేతరగతికి చెందిన మనుష్యులందరిలోనూ....ఎంతవిచిత్రానుభవం అది ? .........ఒకర్ని ప్రేయసిగానూ, ఒకర్ని————(కమల టేబిలు మీదిపుస్తకాన్ని ప్రసాద్ మొఖానికి తిన్నగా విసురుంది. అతను శిక్షవమానాలతో ఖిన్నుడై మెల్లగా తనకు తనే నిగ్రహించుకుని మళ్ళా కిటికీ దగ్గరికి వెళ్ళి తనకొడుకును చూస్తూ పెద్దగా నిట్టూరుస్తూ నెమ్మదిగా వెళ్ళిపోతాడు. కమల ఏడుస్తూ సోఫామిద కూలిపోతుంది.)

## ప్రవేశం : మోహన్; సుషీమా,

మోహన్ : నీవురానేలేదేమే అమ్మా. నిన్నుతోటలోకి తీసుకుపోదామనే మేంతిరిగి వచ్చాం, ఏమిటేమ్మా ఏడుస్తూన్నా వెందుకనే (సోఫాకు పక్కగా మోకాళ్లపై వంగుతాడు.)

కమల : మోహన్. మోహన్, మోహన్ (చేతివేళ్ళను మోహన్ తలలో జొనిపి దువ్వుతుంది.)

సుషీమా : మీకిప్పుడు యిద్దరుపిల్లలు. నన్ను మీకుమార్తెగా భావించండి యికనించి.

కమల : నీవునన్ను తల్లిగా భావించగలవా సుషీమా.

సుషీమా : నేనుచూసిన స్త్రీలందరిలోనూ మిమ్మల్నే నేను తల్లిగా భావించగలను. (ఒకరికొకరు నడుంచుట్టూ చేతులువేసికొని తోటవేపుకు నడుస్తారు. మోహన్ టేబిలుదగ్గరికివెళ్ళి ప్రసాద్ సిగరెట్టు కేస్‌తీసి చూస్తాడు.)

మోహన్ : అమ్మా ఎవరిదే యీడైమండ్ సిగిరెట్ కేసు? నిన్నుచూట్టానికెవరొచ్చారే యిప్పుడు ?

కమల : (మొఖం పక్కకుతిప్పి) ఆ, ఎవరూకాదు. అంతతెల్సుకోవాల్సిన మనిషికాదు. ఎవరో అనామకుడు.

తెర.



1. ఒక నాటకాన్ని వ్రాయాలనుకున్నప్పుడు, చూడాల్సిన ముఖ్యాంశాలు. అందులో తప్పనిసరిగా హీరో, హీరోయిన్లు, విలన్లు ఉండాలా? లేక, విధివల్ల ప్రేరేపింపబడి కర్మబద్ధులైన పాత్రలుంటే వచ్చే ఫలితమేమిటి?

2. పూర్వం నాటకాలకూ నేటి నాటకాలకూ ఉన్న తేడాలేమిటి?

3. నాటకంలోని పాత్రలు తమ పేర్లను ప్రేక్షకులకు ఎట్లా పరిచయం చేసుకోవాలి?

4. నాటక రంగంమీద ఈ క్రిందివాటి ప్రభావాన్ని వ్రాయండి. (1) సినిమా (2) వినోదపు పన్ను (3) రేడియో (4) నాటకాలు అచ్చు వేయటం (5) ఆడతారలు (6) నాటక విమర్శకులు. (7) సెన్సార్లు. (8) కిరాయి నటులు.

5. ఎమెచ్యూర్ ఉద్యమం బాగుపడాలంటే కనీసపు వసతు లేమిటి?

6. ఆంధ్ర నాట్యకళా పరిషత్తు ఎమెచ్యూర్లకు చేసిన ఉపకారం ఏమిటి? లేదా అపకారమైనా సరే. ఎందుచేత?

7. నాటకాలలోని పాత్రలు, ఏడుపొచ్చినా, కోపమొచ్చినా పద్యాలు చదవాలా? లేకపోతే వచ్చే ప్రమాదమేమిటి?

8. నాటకంలో బిగి ఉన్నప్పుడు పాటల్ని ఇరికించటం మంచిదా? ఎందుచేత.

9. ఆర్కెస్ట్రాలో హార్మనీ ఉండాలా? ఎందుచేత?

10. ఒక నాటకాన్ని చదవటానికీ ఒక నవల చదవటానికీ ఉండే తేడా ఏమిటి?

11. "నటకులు తెలివైనవాళ్లయితే ఎంత చెత్త నాటకమైనా రాణిస్తుంది; నటకులు మూర్ఖులైతే ఎంత ఉత్తమ నాటకమైనా దుమ్మవుతుంది;" అనే ప్రవచనం ఎంతవరకూ నిజం?

12. ''కళత్యావత్తు ఆఖరికి నిమ్ప్రయోజకమని'' ఆస్కారువైల్డు అంటాడు .అది ఎందుచేత నిజం కాదు !

13. ఈనాటకానికి ''అనామకులు'' అని రచయిత ఎందుకు నామకరణం చేశాడు?

14. ఈనాటకంలో అందరూ పరువూ, ఆత్మవిశ్వాసమూ ఉన్న వాళ్ళే అయితే అనామకులెవరు?

15. ఇందులోని వివిధపాత్రల ప్రవేశనిష్క్రమణాలను జాగ్రత్తగా పరిశీలించి అవిసహజంగా ఉన్నాయో లేవో వివరించండి.

16. కృష్ణప్రసాద్ జీవితాదర్శాలేమిటి? అతని వాదనా విధానాన్ని విమర్శించండి.

17. జానకి, లలిత, సుషిమ, కమలల్లో ఎవరు తెలివైన ఆడది ? ఎందుచేత ?

18. అనామకులు కామెడీఅయితే, కామేడీకీ ఫార్సుకీ తారతమ్యం చెప్పండి.

19. హాస్యానికీ అపహాస్యానికీ తేడాఏమిటి ?

(1) నువ్వు కాలుజారిపడటం (2) ఆతను 'బాగుబాగు' అంటే ఉడుక్కోవటం, (3) ఇంకొకడు తెలియక మరుగునీళ్లు పోసుకొని ఏడ్వటం ఇవి హాస్యాలా ?

20. భమిడిపాటి కామేశ్వరరావు, మొక్కపాటి నరసింహశాస్త్రి గార్ల హాస్యానికీ (!) గురజాడ అప్పారావుగారి హాస్యానికీ తేడా వివరించండి.

# అనామకులు

సా. జోగిరాజు

అస్కార్ వైల్డు వ్రాసిన "ఎడమన్
ఆఫ్ నో ఇంపార్టెన్సు"కి
అనుసరణ.

[ 7 ]

సంపాదకుడు : దర్భా రాం షా.



కళాకేళీ ప్రచురణలు, శామల్‌కోట.